# దైవ భక్తి

# DAIVA BHAKTI

**(Telugu Poems; Songs**
**&**
**Sanskrit Verses)**



***By***


**Dr. M.V. SATYANARAYANA,** M.A., Ph.D.
Editor : Telugu & Sanskrit Manuscripts
Dr. V.S. Krishna Library
Andhra University
VISAKHAPATNAM - 530 003
A.P., INDIA

# దైవభక్తి

## విషయ సూచిక

## (CONTENTS)

## వేదాలు

ఆదిని వెలసిన – వేదాలతు
మదిని నిలిచిన – స్వరాలు
వినిన తెలియును – అర్థాలు
కనిన కలుగవు – భవాలు॥

ప్రకృతి వర్ణనలు – వేదాలు
వినిన కలుగును – భావాలు
చదివిన తెలియును – మర్మాలు
కనిన కలుగవు – భేదాలు॥

విశ్వసాహితికి – మూలాలు
విశ్వకవులకు –వకుటాలు
మానవ జాతికి – మాన్యాలు
వీణాపాణికి – హారాలు॥

ధర్మ కర్మలకు – నిలయాలు
భక్తికి ముక్తికి – మార్గాలు
జ్ఞాన యోగులకు – ధ్యేయాలు
శ్రోతల చెవులకు – శ్రావ్యాలు ॥

మనస్సు – మార్చి
ఆత్మను తెల్పి
జీవుని – దేవుని
చేస్తాయి – వేదాలు

మన వేదాలు”
ఋషులు – తెల్పిరి – సూక్తాలు
ఋషులు – సృజించిరి – మంత్రాలు
ఋషులు – రాసినవి – భాష్యాలు
అపౌరుషేయాల్ – వేదాలు”

## ఉపనిషత్తులు

పలుకుతాను – సత్యం
చేస్తాను, నా – ధర్మం
హింసించను – జీవుల్ని
ప్రేమిస్తా – మానవుల్ని
యత్నిస్తా – శాంతికే॥

=×=×=

ఓ మాతృదేవి! – నమస్తే
ఓ పితృదేవ! – వందనం
ఓ గురుదేవ! – ప్రణామం
ఆంధ్రమాత ! జై జై
భరతమాత! – జోహార్॥

అవే నా – ప్రమాణాలు
ఇవే నా – ప్రణామాలు
నాకుండవ్ – ప్రమాణాలు
ఆశీర్వదించండి
నన్నాశీర్వదించండి

=×=×=

సత్యం ధర్మం – ప్రేమ
అహింస – శాంతి – పథాలె
మానవ – కళ్యాణానికి
మంచివంటారు – మాన్యులు

=×=×=

## పార్టు - 4

## కృతి సమర్పణము

## శ్రీ వేంకటాచల మహత్యము (1979)

బ్రహ్మాండమంతయుఁ బరగనిండిన శక్తి
ప్రాణి కోటినిఁ గాచు భవ్యశక్తి

ముక్కోటి దేవతల్ మునులు గొల్చెడి శక్తి
ప్రాణులందుదెడి ప్రాణశక్తి

పంచభూతాత్మక బ్రహ్మశక్తియె భువి
వేంకటేశాఖ్యతో విగ్రహంబు

వెలసె సప్తగిరుల విశ్వపూజ్యంబయి
సురనర గంధర్వ శుభద మగుచు,

పద్మావతీ దేవి పతియయి శ్రీశుండు
భక్తకోటిని గాఁచు భద్రమూర్తి,

పుణ్యగిరులఁ బాబు పుణ్యతీర్థంబులఁ
గ్రుంకులిడి పతితి క్రూరులెల్ల

శ్రీనివాసునిఁ గొల్చి శిష్టులై రెన్నడో
వేంకటాచల కీర్తి విశదమయ్యె,

కలియుగ నరులకు గష్టముల్ బాపుచు
భక్తిముక్తులొసగు భవ్యమూర్తి

వేంకటేశు మహిమ వేనవేల్పు గడగా,
సత్యనారాయణ సంతరించె

సప్తగిరుల మహిమ స్కాందమందున్నది
తెనుఁగు చేయ నాకు ధీయొసంగి
వెలయఁసేసి తవె వేంకటేశ్వర! నాదు
కృతిని స్వీకరించి కృపను బ్రోవు

(శ్రీ పద్మావతీ సహిత శ్రీ వేంకటేశ్వరప్రణమస్తు)

## కృతి సమర్పణమ్

## శ్రీ జగన్నాథ క్షేత్ర మహత్యమ్ (1988)

1. పూతే భరత ఖండేఽస్మిన్। దివ్యే కృతయుగే పురా।
   ఓఢ్ర దేశే ప్రసిద్ధేతు। బ్రహ్మణాసు ప్రతిష్ఠితః॥

2. నీలాచల నివాసోఽసౌ। ముక్తిదః పురుషోత్తమః
   ఇంద్ర్యుమ్నవిభోరశ్వ। మేధయాగ ఫలప్రదః॥

3. జగన్నాథః స్వయం భూశ్చ। సర్వలోకేశ్వరః ప్రభుః।
   సర్వజీవాత్మక శ్రీశః। బ్రహ్మరూపస్సనాతనః॥

4. దారురూపధరో కృష్ణః। భక్తానుగ్రహవాంఛయా।
   చతుర్ధాభిన్నిరూపోఽపి। పేకేవహరిర్ధ్రువమ్॥

5. సుభద్రా బలభద్రశ్చ। శ్రీపతిః పురుషోత్తమః॥
   శ్రీ దంసుదర్శనం చక్రం। పూజ్యన్తే దేవమానవైః॥

6. పూరీ దేవాలయే దివ్యాన్। చతరో విగ్రహాన్ సదా।
   పూజయన్తి యథాశాస్త్రం। నిష్ఠావన్తోద్విజోత్తమాః॥

7. పితృదేవహితం కర్మ। కార్యం దేవాలయేఽతృహి।
   తత్ప్రసాదశ్శిరో ధార్యః। మూఢానాంచ వివేకినామ్॥

8. బ్రహ్మజ్ఞానం దదాత్యేషః। దారుబ్రహ్మ మయోహరిః।
   సర్వేషాః ప్రాణినాం చిత్తవాసీ శ్రీపురుషోత్తమః॥

9. భుక్తి ముక్తి ప్రదోదేవః। జగన్నాధో దయామయః।
   సుభద్రా బలభద్రాభ్యాం। సహిత శ్శాంతి దాయకః॥

10. సర్వదారిద్ర్య హర్తాచ। సేవ్యః శ్రీపురుషోత్తమః॥
    అర్చనావిధి రస్యాపి। సులభా సర్వదేహినామ్॥

11. త్వదంశకస్త్వ మేవాహం। మచ్చిత్తస్థ స్త్వ మీశ్వరః।
    త్వద్భిన్నోఽహం కథం దేవ। స్వరూప జ్ఞానదాయక॥

12. జగన్నాథ! భవత్ క్షేత్రమహాత్యం కయితం మయా।
    స్వీతురుష్య కృతించేమాం। భక్త ముక్తి ప్రదాయినీమ్॥

## కృతి సమర్పణము

## భగవాన్ శ్రీసత్యసాయి సూక్తి ముక్తావళి (1984)

శాస్త్ర విహితములౌ సత్కర్మలను జేయ
శక్తి చాలదిపుడు సజ్జనులకు
బుద్ధిహీనులవల్ల పుణ్యపురుషులకు
హాని కల్గుచునుండె నవనిలోన
ధర్మ కర్మములందు దగు శ్రద్ధలేనట్టి
పాలకుల్ ప్రజలును బాధపడరె
విద్యయు విభవంబు వేయి రెట్లున్నను
వ్యసన తత్పరులకు వ్యధయె కలుగు
అట్టి జనుల గావనవతరించితి సత్య
సాయిబాబ! కలిని శాంతి నొసంగ
సర్వదేవమయుఁడ! సర్వాత్ముడవు నీవె
సర్వ దేహములందు సంచరించి
సర్వదేశ జనుల సకల చేష్టల నెపుడు
సాక్షివై యెఱుగుదు శాశ్వతుడవు॥
స్థూల దేహముతోడ సూక్ష్మ దేహము తోడ
దర్శనంబిడుదువు ధరణిలోన
నిన్ను నెఱిగియున్న నిన్నెఱుగకయున్న
మనుజ కోటిని గావ మహిమ జూపి
సత్యధర్మ ప్రేమ శాంతి రూపుడవౌట
సంఘసేవ యొనర్చు సర్వులకును
సత్యసాయీశ్వర! శాంతి సుఖము లిచ్చి
కలియుగ దైవంబ కావు మెపుడు
సూక్తి ముక్తావళి శుభము చేకూర్చగా
రచియంపజేసితి రవ్వరూప।
నీదు నడులె యివ్వి నీవె గైకొమ్మ యీ
కృతిని; సాయి తత్వకృతిని భక్త
తతికి ముక్తి కల్గు; దర్మరక్షకుడవు
సతతము మమ్ము బ్రోవ సాయిదేవ॥

## కృతి సమర్పణము

## భగవాన్

## శ్రీసత్యసాయి శతకము (1973)

సాయి శతకమేను సద్భక్తితో వ్రాయ
శక్తి నొసఁగివీవె సత్యసాయి
కృతి నొసంగు చుంటిఁగృవతోడగైకొను
సత్స్వరూప! సత్యసాయిబాబ!

=×=

## శ్రీ రామ శతకము (11-4-1973)

రామలింగేశ్వర! రామ ప్రతిష్ఠిత!
శ్రీ విష్ణుసన్నుత! శివ! ఉమేశ

పార్వతీ గణనాథ భాస్కర సేవిత!
చంద్రశేఖర! లోకశాంతి దాత!

నాగభూషణ! దేవనాథాది సంస్తుత!
భస్మరాజిత గాత్ర! ఫాలనేత్ర!

సత్యనారాయణ సన్నుత! శుభగాత్ర।
యోగీంద్ర వందిత! యోగదాత!

స్వీకరించినాదు శ్రీరామ శతకంబు
స్థిరపదమఙ్మ నిమ్ము చెన్ను మిగుల
రామరావు నీకు రహిదేవళము గట్టి
పూజ సల్పు నతని బ్రోవు మీశ!

=×=

## కృతి

## శ్రీకృష్ణశతకము (1973)

కృష్ణ! దేవ! నీదు కృపచేత వ్రాసితిన్
కృష్ణ శతకమిత్తుఁ గృతిని గొనుము
నాదు రూప మీవె నారాయణ! హరి।
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత

×=×

## కృతి సమర్పణము

## శ్రీపాండురంగ శతకము (1974)

పాండురంగ! నిన్నుఁ బరమయోగులయిన
సంస్తుతింపఁగ లేరు సత్త్వతేజ।

భక్తు లెఱుగ నిన్ను బాండురంగ శతక
మీవె వ్రాయించితి విష్ణదేవ।

సత్యనారాయణ శకతక కర్త యటంచు
పేరు తెచ్చితివీవె ప్రేమ రూప!

కృతిని జేయించితి కృతిని గైకొనుమిదే
పరమాత్మ రూప! యో పాండురంగ!

సాయి రామకృష్ణ శతకంబులను వ్రాయ
శక్తి నొసఁగెఁగాదె సాయి నాకు
సాయి పాండురంగ సన్నుతుల్ సేయుదు
పాండురంగ! యిమ్ము పరమ పదము

=×=

# శ్రీ జగన్నాథస్తుతి

డా. ఎం. వి. సత్యనారాయణ

శ్లో॥

1. పూతే భరత ఖండే స్మిస్। దివ్యైకృతయుగే పురా।
   ఓఢ్రదేశే ప్రసిద్ధేతే। బ్రహ్మణా సుప్రతిష్ఠిత:॥
2. నీలాచల నివాసో సౌ। ముక్తిద: పురుషోత్తమ: ।
   ఇంద్రద్యుమ్న విభోరశ్వ। మేధమాగ ఫలప్రద:॥
3. జగన్నాథ స్వయంభూశు। సర్వలోకేశ్వర: ప్రభు:।
   సర్వజీవత్మక శ్రీమ్శ: । బ్రహ్మర్వస్వనాతన: ॥
4. దారురూపధరో కృష్ణ । భక్తానుగ్రహవాంఛయా।
   చతుర్ధా భిన్నరూపోపి । ఏకెవహరిర్మవమ్ ॥
5. సుభద్రా బలభద్రశు । శ్రీపతి: పురుషోత్తమ: ।
   శ్రీదం సుదర్శనం చక్రం । పూజ్యన్తే దవమానవై: ॥
6. పూరీదేవాలయే దివ్యాన్ । చతురో విగ్రహాన్ సదా।
   పూజయన్తి యధాశాస్త్రం । నిష్ఠావన్తో ద్విజోత్తమా:॥
7. పితృదేవహితం కర్మ । కార్యందేవాలమే త్రహి।
   తత్ర్పసాదశ్విరోధార్య: । మూఢానాం చవివేకినామ్ ॥
8. బ్రహ్మజ్ఞానం దదాత్యేష: । దారుబ్రహ్మమయోహరి: ।
   సర్వేషాం ప్రాణినాం చిత్తవాసీ శ్రీపురుషోత్తమ:॥
9. భుక్తిముక్తిప్రదోదేవ: । జగన్నాధో దయామయ : ।
   సుభద్రా బలభద్రాభ్యాం । సహితశ్శాంతి దాయక: ॥
10. సర్వదారిద్ర్య హర్తాచ । సేవ్య:శ్రీ పురుషోత్తమ: ।
    అర్చనావిధిరస్యాపి । సులభా సర్వ దేహినామ్ ॥
11. త్వదంశకస్త్వమేవాహం । మచ్చిత్తస్థస్త్వమీశ్వర : ।
    త్వర్పిన్నో హంకథం దేవ । స్వరూప జ్ఞానదాయక ।
12. జగన్నాథ । భవతీక్షేత్రమాహాత్మ్యం రచితం మయా ।
    స్వకురుష్వ కృతించే మాం । భక్తముక్తిపుదాయినీమ్॥

# శ్రీ సత్యసాయీశ్వరీ స్తుతి

రచన।। డా।।ఎం.వి.సత్యనారాయణ

1. సత్యసాయీశ్వరీంవన్దే। సర్వలోక నివాసినీమ్।
భక్తాభీష్ట ప్రదాత్రీంత్వా। భవరోగ వినాశినీమ్।।

2. అజ్ఞాన నాశినీం దేవీం। సుజ్ఞానామృత దాయినీమ్।
శుద్ధ మోక్ష ప్రదాత్రీం చ । భజామి మనసా సదా।।

3. పూర్వ జన్మకృతం పాపం । వ్యాధి రూపేణ బాధ్యతే।
త్వద్దర్శన స్పర్శనాభ్యాం। సర్వబాధానివార్యతే।।

4. పూర్వ జన్మకృతాత్పుణ్యాత్। దర్శనం మమ యచ్ఛసి।
సాష్టాఙ్గవన్దనం కర్తుం। దయాంకురుమయీశ్వరి।।

5. షట్చక్ర చారిణీ దివ్యా। కుండలి న్యాఖ్యయా మమ।
సుషుమ్నామార్గ సంచారిణ్యంబా సాయీతి మేమతిః।।

6. శ్రీ షోడశాక్షరీ విద్యా। రూపిణీం త్వాము పాస్మహే।
బ్రహ్మజ్ఞానం సదా దేహి। భవరోగ వినాశిని।।

7. లౌకికా లౌకిక జ్ఞానం । లౌకికా లౌకికం సుఖమ్।।
కుటుంబ క్షేమ సౌఖ్యేచ। మమదేహి దయామయి।।

8. మత్సాధన సుసంతుష్టా। సహస్రారామ్బుజస్థితా।
శివేన సహమోదస్వ। ఆనందం దేహిమే సదా।।

ప్రశాంతి నిలయము,
27-10-1973,
'సనాతన సారథి।
మార్చి 1974.

# నవరత్నాని

డా॥ ఎం.వి.సత్యనారాయణ

శ్లో1. మాతృశ్రియమహం వన్దే। మన్మనోవాసినీం రమామ్॥
భక్తా భీష్ట ప్రదాత్రీంతాం। భక్తచిత్త ప్రకాశినీమ్॥

2. బ్రహ్మ స్వరూపిణీ మంబాం। బ్రహ్మజ్ఞాన ప్రబోధినీమ్॥
అన్నదాన ప్రియాం దేవీం। అన్నపూర్ణామహంభజే॥

3. సత్యప్రేమ స్వరూపాం తాం। సదాసద్భక్త సేవితామ్।
యోగీశ్వరీం యోగకరీం। భుక్తిముక్తి ప్రదాయినీమ్॥

4. సుప్రసన్న ముఖీం దివ్యాం। ఆత్మతేజో విరాజితామ్।
సతతం వాక్సుధావర్షై। భక్తతాపాపహారిణీమ్॥

5. సర్వశక్తి స్వరూపాం తాం। సర్వపాపాపహారిణీమ్।
సాధుప్రీతాం సదాతుష్టాం। సర్వప్రాణి హితేరతామ్॥

6. సచ్చిదానంద రూపాంశ్రీ। మాతృదీవీంభయా పహామ్।
వేదవేదాన్త విజ్ఞాన। ప్రదాంరోగా పహాం భజే॥

7. అన్నదాత్రీం జ్ఞానదాత్రీం। ఆత్మజ్ఞాన ప్రదాయినీమ్।
అఖిలై స్సేవ్యమానాంశ్రీ। మాతృప్రేమ స్వరూపిణీమ్॥

8. భావజ్ఞాంభక్తవరదాం। సర్వజ్ఞాం సమదర్శినీమ్॥
భాగ్యశాంతి ప్రదాందేవీం। విశ్వశాంతి కరీంభజే॥

9. సర్వదైవ స్వరూపాంతాం। సర్వలోక విహారిణీమ్।
జిల్లెళ్ళమూడి గ్రామస్థాం। అమ్మాఖ్యాంచ సదాభజే॥

మాతృశ్రీ,
మాసపత్రిక
జూలై, 1976.

## శ్రీ బాలాంబా స్తుతి

బాలాంబ ! – ఓ భవహారణి!
దయ చూపుమా – దయారూపిణి॥

పరాశక్తి – ఓ పాపహారణి
సర్వరూపిణి – సర్వహారిణి
కామశక్తి – ఓ కామేశ్వరి
లోభమేల నాలో – లోకేశ్వరీ ॥ బాలా॥

మదమడపుమా – మదహారిణి!
క్రోధమేలనాకు – క్రోధనాశని!
మోహనాశని – జగన్మోహిని!
మత్సరంబు మాపు – మాయామోహిని॥

దీనుని కావుమా – దీన కల్పవల్లి
భాగ్యమొసగుమా – భాగ్య కల్పవల్లి
జ్ఞాన మీయవె – జ్ఞాన రూపిణి!
మోక్ష మిమ్ము నాకు – మోక్షదాయిని ॥బాలా॥

## శ్రీ బాలాత్రిపుర సుందరీనుతి

బాలాంబ! రావా – నను బ్రోవపేగ
నిన్నే నుతియించు – చున్నానుమా॥

బృహ్మాది సురలు – భువిలోన, మునులు
నిన్నే స్తుతియించు – చున్నారుగా
కైవల్యమీవే–కృతువులు నీవే
కరుణింప వేగమె – రావే ఉమా ॥ బాలా॥

భువనాలు నీవే – భవములు, నీవే
భాగ్యాలు, నీవే – భావాలు, నీవే
అజ్ఞాన మణచి – సుజ్ఞాన మొసగి
కైవల్య పదమును – చేకూర్చుమా

లోకాలు మాయ – లోకులు మాయ
మానవులాహుతి – నీమాయకు
మాయలోత్రోయకు – మర్మము తెలుపుము
త్రిపుర సుందరీ! – దివ్యరూపిణి ॥బాలా॥

– : –

## శ్రీ దేవీస్తుతి

రాజరాజేశ్వరీ ! రాజ్యదాయినీ ! దేవీ!
షట్చక్రచారిణి ! శాంతిదాత్రి !

జన్మమృత్యువులను, జరము లేకుండగాఁ
జేయఁగలవు నీవె, జీవతతికి

షోషశాక్షరి మంత్ర శోభితాంగివి, నీవె
ఆనందదాయిని నాదిశక్తి !

నన్ను సృజించితి, నాదేహమందలి
షట్చక్రములయందు సంచరించు

కులయోగినివి, దేవి ! కుండలినీ శక్తి
వైవసింతవు తల్లి ! వైభవముగ

యోగీశ్వరీ ! దివ్యయోగదాయిని వమ్మ
సప్త కమలముల సంచరించి

శివశక్త్యైక్యంబు చెందగా, సాధకుఁ
బోత్రసహింతువు కదా ! భువనమాత !

సర్వకాలములందు సంచరించుచు నీదు
మంత్రరాజంబు, నీ మహిమఁ । దెలిసి.

నీవె నేననుకొని, నే నెనీవనుకొని
నిరతంబు నినుఁజూతు నీదుసుతుఁడ!

సంసార సాగర సంచార మికనేల?
నీలోన జేర్చుమా! నీదు సుతుని

కష్టసుఖయుతంబు కర్మఫలంబున్
ననుభవింపవలెనె, నాదు జనని !
ముక్తి నొసగు దీవె, మోక్షదాత్రీ ! సాధ
కాగ్రగణ్యులకును, కల్పవల్లి !

## సుందరి

ఆమె ఎవరో - ఎన్నడూ చూడలేదు !
ఆమె రూపం - అధ్భుతం - ఆనందదాయకం ॥ ఆమె ॥

దివ్య కాంతులతో - దేహందీపిస్తు నాది
ఒక కన్ను చంద్రుడు - ఇంకొకటి రవిబింబం
ఫాల భాగమందు - ప్రజ్వరిల్లు అగ్నిజ్వాల
త్రిలోక సుందరి - సౌభాగ్య దేవత ॥ఆమె ॥

షోడశ కళలతో - శోభిస్తున్న దామె
అన్ని అవయవాలకు - అందమైన ఆభరణాలు
చెరుకు గడ చేతిలో - చక్కగా - పట్టుకుంది
శ్రీ చక్ర దేవతయే - చిదానంద రూపిణియో ॥ ఆమె ॥

సృష్టి స్థితిలయాలు - చుయుచున్నదా తల్లి
త్రిమూర్తుల కెల్లప్డు - దివ్యశక్తి నిచ్చు దేవి
వేద స్వరూపిణ -వైరాగ్యదాయిని
భక్తముక్తిదాయిని - రాజరాజేశ్వరి ॥ఆమె ॥

- : -

## ఏడుకొండల సామి

ఏడు కొండల సామి - ఏల మరచితినయ్య !
వేడుచుంటిని రమ్ము - వేంకటా ! రమణా ॥ ఏడు ॥

ఆదివిష్ణువ ! శ్రీశ ! నిన్ను - మదిలోన, నుతిసేతు
సర్వంబు నీవైన - సకల దూరుడవయ్య
సర్వరక్షక ! నీకు - సాటియే, వేరయ్య ॥ ఏడు ॥

జడులైన బిడ్డలను – జడదారులుగ చేసి
ఇడుములను, పెట్టెదవు – ఈయకుంటే, కొప్పు
మొక్కుకొనినవారి – గ్రక్కునా గాచెదవు
మొక్కు మరచినవారి – నెక్కించెదవు రచ్చ ॥ ఏడు ॥

వడ్డికాసులి కేల – విశ్వంబు నీదేను
జడలన్న – ప్రియమేల – జడదారులకు, రేడ !
మూఢభక్తికె –మిగుల – మురిసిపోదువు రమణ !
దృఢభక్తి కల్గించి – తరియింపు భక్తులను ॥ ఏడు ॥

– : –

## శ్రీ వేంకటేశ నుతి

విశ్వరూప ! దేవ ! వేంకట రమణా !
విశ్వరక్షక ! గావ – వేవేగ రావా ॥ విశ్వ ॥

వెన్నముద్ద లివిగో – వేడుకతో గొమ్ము
వెన్నంటి తిరుగు – మాయింటి వేలుప
పైడి పళ్లెములోని – పాయసము నీకె
పాడి పంట లొసగి – పరము పదము నిమ్ము ॥ విశ్వ ॥

మల్లెమాలతి, తులసి – మాల గైకొని, వి
మాలమౌ, మనమున – విడియంగ, రావ
తన మన ధనముల – తప్పక నీ కిత్తు
తనువు మరచిన, తరి – తరియింప రావా ॥ విశ్వ ॥

ఈ లోకమంతట – నిండి నీవున్నావు
నీలోన సర్వము – ఇమిడి యున్నది,యాశ !
సర్వకర్త వీవె – సర్వభర్తవు నీవె
సకల హర్తవు నీవె – సాయుజ్యము నీవె ॥ విశ్వ ॥

– : –

## జీవుడే – దేవుడు

నమ్మాలోయ్ – జీవుడె, దేవుడు – నమ్మాలోయ్
నమ్మని, జడుడు – దేవుని, కనలేడోయ్ ॥ నమ్మా ॥

కర్మను బట్టి – జన్మలు కల్గును
కర్మ చేతనే – కష్ట సుఖాలు
కర్మ దాటగా – కాలుని వశమా ?
మర్మము, తెలియక – మోసపోకుమా ? ॥ నమ్మా ॥

రక్తుడవైతే – రోగివౌదువు
భక్తుడవైతే – ముక్తుడవౌదువు
భక్తుల భారము – భగవంతునిదే
భక్తి కల్గిన – జీవుడె – దేవుడు ॥ నమ్మా ॥

కర్మకంటెను – భక్తి గొప్పది
నిర్మల జ్ఞానం – మోక్షము నిచ్చును
కర్మల విడిచిన – జన్మమె లేదు
మర్మ మెరుగుమా – మనుజుడా ! ఇపుడే ॥ నమ్మా ॥

– : –

## <u>పితృదేవుడు</u>

పిత ! లోకహిత – ప్రత్యక్ష దేవ !
పరమాత్మ రూప –పాహి, మాం ॥ పిత ॥

బాల్యమునుండి – భాగవతుండవు
పిత్రభక్తుడౌ – పరధన విముఖ
సత్యము, శౌచము – సహజములౌ, పర
పౌరాణికుడవు – పరహిత కరుడవు ॥ పిత ॥

అతిథి వరులను – అభ్యాగతులను
ఆదరమ్ముతో – అర్చన సేతువు
అందరి మన్నన – లందుకొంటివి
ఆత్మవేదికై – అలరుచునుంటివి ॥ పిత ॥

సర్వజీవులను – సమభావముతో
చూడగల్గుటలో – చతురుడ ! నీకు
సర్వేశ్వరుని – సాయుజ్యంచే
భవమే వేదిక – భాగవతోత్తమ ॥ పిత ॥

– : –

## గే య రా మా య ణ ము

### రచన : డా. ఎం.వి. సత్యనారాయణ

### వి న్న ప ము

రఘువంశ తిలక – రామచంద్ర ! పాహి
కౌసల్యా ప్రియసుత – దశరథనందన
భూజాతాహ్రదయేథ – మారుతి సేవిత
పరమేశ ! పరమాత్మ – బ్రహ్మరూపా ! రామ ! 1

తామసహరుడవు – తాపస పూజిత
భగవంతుడవు నీవు – భవ్య మునిరక్షక
ధర్మరూపుడ వీవు – ధర్మ రక్షక ! రామ !
సత్యసంధుడయ్యు – సకల సేవిత ! రామ 2

రాజాధిరాజుడవు – రాజసరహితుడవు
రావణ మర్దన – రాజ్యమే లినపుడు
రాణించితివి రామ – నీకు నీవే సాటి
కరుణా సాగర ! రామ – కావుము నన్నెపుడు 3

కామక్రోధాదులు – కలత పెట్టుచునుండ
కలియుగ మాయచే – కలుగదు జ్ఞానము
మనసు నిల్పదు నీషె – మానవుడ నయినా
దానవ గుణములు – దాపరించెను, నాకు 4

నా రూప మెరుగును – నీ రూపు తెలియునా ?
నీరజ నయన ! నీవే – దర్శన మిమ్ము
నిఖిల జగములందు – నిండియుంటివి రామ !
నిన్నే నమ్మియుంటి – నీలమేఘ శ్యామ ! 5

నిన్ను నమ్మనివారు – లోకకంటకులగుచు
రావణు లగుచుండ – రామా ! చూచట తగునా
ఉత్తమ గుణజాల – సుజనుల గావుమా
సత్త్వతేజుడ ! రామ – సాటి నీ కెవ్వరు ? 6

సర్వ దేహములందు – మెలగు జీవులు నీవె
సర్వంబు సృజియించు – చతురాననుడ వీవె
ప్రాణుల పోషించు – హరివి నీవే తండ్రీ
లయము చేయగల – హరుడవు, మారామా ! 7

దీనభాంధవుడవు – దివ్యాత్మ రూపుడవు
నీకంటె వేరేది – లేదని మునులంద్రు
నీవే దిక్కు నాకు – నీతత్త్వ మెరుగను
నీవు నేనొకటని – నీవే తెల్పుము స్వామి ! 8

గర్భ నరక బాధ – కలుగకుండగ, బ్రోవు
పాపముల్ సేయుచు – పడనేల, నరకాన
నీ నామ కీర్తనమె – నిరతము చేయుదును
నిన్ను విడువను రామ – నీలోన జేర్పుము. 9

నీ పాద సేవనము – నిరతము, నే చేయుటకు
నను కరుణింపుము – జానకీ రమణా !
సంసార సాగరము – నే నీదజాలను
క్షీర సాగర శయన – నీవే దరి చేర్పుము 10

నా యింద్రియా లెపుడు – ఎన్నో యిడుములు పెట్టు
మనసు నదుపున – బెట్ట – నా తరమా, రామ
నీపైని నామనసు – నిలువకున్నది, రామ
మరల కల్గున – ఈ మానవ జన్మంబు 11

భద్రాద్రి రామా – నా భవబంధమును బాపు
దశరథ రామా – సీతారామా, అయోధ్య రామా
ఆత్మాభిరామా – వాయునందన విభుడ !
బ్రహ్మజ్ఞానము నిమ్ము – నీ పాదదాసుడ 12

సకల దేవతలలో – సత్వస్వరూపుడవు
సకల భక్తుల బ్రోచు – సాక్షాత్తు మాధవుడౌ
సన్ను తింతును నిన్నె – సతతము, శ్రీరామ !
కౌసల్యానందన – కైవల్య మొసగుము 13

వాల్మీకి విరచిత – రామాయన గాథ
రంజింప జేయును – రాజాధిరాజులను
రాముని మించిన – దేవుడు లేడనెడి
రామభక్తుల కెపుడు – కీడు రానే రాదు 14

నా జన్మ తరియింప – నరుల హితము కోరి
గాన యోగ్యముగాను – సీరామాయణ గాథ
నా చేత రచియింప – జేయుము – శ్రీరామా
నీ ఆత్మరూపుడ కానా – ఆత్మారామా ! సీతారామా 15

నీ నామావ్రతమే – రామాయణ సుధగాన,
నిష్ఠతో గ్రోలుచునె – నీమూర్తి చూచుచునే
గేయ రామాయణము – జ్ఞానులు మెచ్చగను
రచియించు శక్తిని – నాకిమ్ము ఇప్పుడే 16

నవరస భరితమౌ – నవ్యకావ్యము గాను
పండిత కవులెల్ల – పరమానందము నొంద
అధ్యాత్మ విదులు – నిన్నెదలోన జూడగా
రామా ! నీ చరితము – రచియింప గలనా ? 17

అజ్ఞానం, అహంకర – మమకారాలున్నవి
ఇంద్రియముల్, మనసు – అదుపులోనే లేవు
కామాదుల వలన – కల్గుచున్నవి కష్టాల్
నీ తత్తమెరుగంగ – కరుణింపు, ననుస్వామి 18

నీవు పరమాత్ముడువు – బ్రహ్మ స్వరూపుడవు
నిత్యుడవు, సత్యుడవు – నిఖిల జగదీశుడవు
నిర్గుణ బ్రహ్మమును – ధర్మమూర్తివి, నీవే
మునులు నిను జూచుటకు – వెతలెన్నో పడ్డారు 19

మహిమ లెన్నో కలిగి – మనుజుని వలె మెలగి
మాయావృతుని వలె – మసలిన దేవుడవు
మాయావు లైనట్టి – రావణాదు లెల్ల
హతులైరి, నీచేత – రణరంగమందున 20

సీత ఆదిశక్తి అని, ఎరుగక, పండితుడు
రావణుడు, కడతేరె – కామాంధుడగుటనె,
మారుతి మహిమలు – మానవాతీతములు
యోగసిద్ధులెన్నో– వానరుండే చూపించె 21

సాధన చేసిన – సాధించ గలరని
అష్ట సిద్దులు చూపె – అనిలజుడందరికి,
బీజాక్షర సంయుతము – రామాయణ కావ్యంబు
భుక్తి ముక్తి ప్రదమని – మునులెపుడో తెల్పిరి 22

గ్రుడ్డివాని కెట్లు – సౌందర్య మగపడును ?
అజ్ఞాని కెట్టులు – ఆత్మానందము కల్గు ?
గొడ్రాలు ఎరుగునా ? కన్నతల్లి బాధ
నీచు లెరుగ గలరా ? నీ మహిమ లిలలోన 23

శుద్ధ సత్త్వరూప ! సుజన తోషక ! రామా !
సుగుణాభిరాముడవు – సీతాపతీ ! రామా !
కరుణామయుడవు – దశరథ సుత ! స్వామీ
కౌసల్యానంద – వర్ధన – శ్రీరామా. 24

మారుతి సేవిత – మాధవ ! జయరామ !
లక్ష్మణ పూజిత – లక్ష్మీశ ! లోకేశ !
భరత ప్రార్థిత – రామ – పట్టాభిరామా !
రామరాజ్యమె సుఖము – రామ ! నీ భక్తులకు 25

బోయవాడొక్కడు – నీ సంకల్పమహిమచే
నీ నామ మంత్రంయు – నిర్మలుడై జపియించి
వాల్మీకియై, యతడు – వ్రాసె, రామాయణము
ఆదికావ్య మదియె – ఆదర్శ మందరికి. 26

మందుడనో రామ ! నీ పుణ్య చరితము
గేయ కావ్యముగ వ్రాయ – దివ్యశక్తి నిమ్ము
వేదపురాణాదు – లెన్నో చదివినవారె
తెలియదందురు – నీ నిజతత్త్వ మెవ్వరకి. 27

యోగవాసిష్ఠము - రామాయణాదులును
నీ యవతార తత్త్వము - నెరుక పరచెను, మున్నె
నీ మంత్ర యంత్ర - తంత్రాలసలే ఎరుగును
నిన్ను వర్ణించుట - నా తరమా, రామా. 28

సాహసముగునేమొ? సీతాచరితము చెప్పక
మీదివ్య జీవనముల్ - మీదివ్యరూపముల్
చర్మచక్షువులతో - చూడగలనా ? దేవా ?
భక్తుని కరుణించి - సాక్షాత్కరింపుదు
29

సుగ్రీవుడనా ? రామ - నీ, సఖ్యము చేయుటకు,
హనుమంతుడనా ? - నీ దాస్యము చేయుటకు
గుహుడనా ? నేను - నీ పాదాలు కడుగుటకు
శబరిని గాను, నా - దరికి వత్తువ ? రామా 30

ఎన్నో జన్మము లెత్తి, ఈ - నరజన్మపొందితి
నరుడవయితివి, నీవే - నారాయణుడవైనా
నరుడను, సత్య - నారాయణుడ, నేను
రామా! నీ చరితము - కావ్యముగ వ్రాయించు. 31

వాల్మీకి మునివలె - నే, తపము సేయగ లేదు
వ్యాస మునివలె - నే, నారాయణుడ గాను
కాళిదాసుని వలె - కాళీభక్తుడ గాను
నీ భక్తుడనని చెప్ప - నే నర్హుడను గాను. 32

మనుజ జన్మము - కడు దుర్లభము గాన
నా జన్మ తరియింప - నా మదినుండి పల్కుము
రామాయణ గాథ - రసానంద జనకముగా
ఈ గేయ కావ్యము - భక్తముక్తి ప్రదము. 33

- : -

## శ్రీ పాండురంగ శతకము

### రచన : డా. ఎం. వి. సత్యనారాయణ

### శ్రీ పండరీ క్షేత్ర మాహాత్మ్యము

శ్రీ హృదయేశ ! విశిష్టమౌ భవదీయ
పావన క్షేత్ర ప్రభావ గరిమ
తలపెట్టి తన్మహత్తము గూర్చి తొలుదొల్త
రచియింతు ; ఆ పైని రమ్యమైన
తావక మహిమాది తత్తమ్ము నాశక్తి
కొలది వ్రాయగ బూనుకొంటి ; నీవె
నానోట వాగ్రూపమూని రారాయుక్త,
నిర్ఝరమ్ముగ గౌత నివ్వటిల్ల
సీస పద్యములను భాసురమ్మగు భావ
పీచికాయమ్ము వెల్లి విరియ
సరళ సరసగతుల దిరముగా బలికించి
పాండురంగ ! యిమ్ము పరమ పదము 1

నీ క్షేత్ర మహిమమ్ము నీలకంఠుడు మున్ను
హర్ష రోమాంచితు డగుచు శైల
జకు గందునకును రజత గిరిపయి దేవ
భాషలో సుధచిందు వార దెలిపె ;
ఆ జటాజూటిని నంతగా నాకర్ష
ణము చేసినట్టి నీ విమల తీర్థ
మహిమమ్ము దేవతామండలి మునిగణ
మ్మును సర్వయుగముల నినుతి సల్పు ;
అట్టి పుణ్యవంతమైన క్షేత్రమహత్త్వ
మెన్న " దరమె ? భక్త బ్రందములకు
మోక్ష సిద్ధి సులభముగ గూర్చెదవుగాన
పాండురంగ ! యిమ్ము పరమ పదము 2

పరమ భాగవతు డు పరపుణ్యశాలియు
నగు పుండరీకుని యందు గరుణ
నామునీచ్చను దీర్ప నలచంద్రభాగ న
దీ తీరమును లోష్ట దివ్యచారు
వేదిపై లక్ష్మితో వెలసితి; నీ వట్టు
లవతరించిన పవిత్రాంక సీమ
పౌండరీక క్షేత్ర పావన స్థలమని
యభిధానమును గాంచెనవని యందు ;
కాని నేడు కలియుగాన నా పౌండరీ
కమును పండరీ పురముగ దెలియ
బలికి నిను న తింత్రు పాండురంగ డటంచు ;
పాండురంగ ! యిమ్మ పరమ పదము 3

అటువైకత్రిని బొందినట్టి యా క్షేత్ర నా
మము నేడు స్వర్గధామమున కెట్టి
గణనమున్నదో యట్టి గౌరవంబున సంత
రించు కొన్నది నీ సమంచిన ప్ర
శాంత మంగళ సుప్రసన్న విగ్రహము శో
భిల్లు మూలంబున విశ్వమాత
యై యున్న పండరీ బాయియు నీప్రక్క
విమల తేజస్సుతో వెలయు కతన ;
వేదమూర్తి వయిన విఠలేశ్వరుండవ
వెలుగు చున్నయట్టి స్థలము వేద
భూమియయ్యె బ్రజలు పూజింప గా నిన్ను ;
పాండురంగ ; యిమ్ము పరమ పదము 4

" పండరీ పురమన్న పాండురంగ డె యున్న
వైకుంఠపుర" మని వాసి గన్న
పండరీ క్షేత్రమ్ము బరి కించినం జాలు
దేవలోకమ్ము సిద్ధించు ననియు
పరవశత్వము నొంది భక్తులెందజో పుణ్య
తమమైన నీదర్శనమును గోరి

వరుసగా బండరీ పురమున కవిభక్త
విధమున వచ్చెద రధిక సక్తి
నిండు కొన్న యెదలు తాండ వింప గ నిన్ను
శతవిధాల కీర్తి సలుపు భజన
కీర్తనలకు దోడు కేలు మోడ్తురు సదా
పాండురంగ ! యిమ్ము పరమ పదము 5

పండరీ పురమందు బదము మోపిన జాలు
బహు తీర్థముల పుణ్య ఫలము దక్కు
చంద్ర భాగా నదిన్ స్నానమ్ము సల్పిన
సురనదీ పావన శోభ విరియు
పండరీ నాథు డౌ పాండురంగని దర్శ
నము జన్మ రాహిత్యము మర జేయు
పండరీ పుర రాజ్ఞి పండరీ దేవిని
కనుల గాంచిన నఘౌఘము నశించు
అచట వీచు గాలులందన వరతమ్ము
వితల ! రంగ ! యనెడు వేదవాక్కు
లాలపింప బడును ; హరి నిన్ను స్మరియింతు.,
పాండురంగ ! యిమ్ము పరమ పదము 6

బధిరు లంధులు నిన్ను బ్రార్థించుచును నీదు
క్షేత్రమ్ము దర్శింప శ్రేయ మెస గ
బధిర జనావళి బధిరత్వమును బాసి
విన జాలుదురు గదా ! విశదముగను
మరియు నంధులు కూడ తిరముగా నందత్వ
మును వీడి నీభవ్య మూర్తి గాంతు
రనపత్యులకున పత్యమ్ము చేకూర, ని
ర్ధినులకు భాగ్య సంప్రాప్తి కలుగు
నీదు క్షేత్ర మెపుడు నిస్తుల మహిమతో
నవ ఘుళింప జనులు హర్షకలిత
చిత్తు లగుచు నిన్ను సేవించెదరు సదా ;
పాండురంగ ! యిమ్మ పరమ పదము 7

అటుల పూర్వమొ్ౌచు నప్పౌండరీ కది
వ్యక్షేత్ర మాహత్మ్య మతిశయింప,
తత్తుల్యముగ బవిత్ర స్థానమౌ విశా
ఖా పట్టణమునందు, గడలి యంచు
నంగల శుభపులిన స్థలమ్మున నేడు
విమల దీధితులతో వెలసినట్టి
భవదాలయము గూడ బ్రాశస్త్యమును జెందె
భక్త పాశుల కాట పట్టు గాగ
సుప్రసన్నమైన సుందరా కారమ్ము
తోడ విఠల ! నీవు తోచె దిచట :
ఇందె నిను నుతింతు ; ఇమ్ము గానను బ్రోచి
పాండురంగ ! యిమ్ము పరమ పదము 8

## <u>శ్రీ పాండురంగని స్తుతి</u>

ఓ ప్రసన్న విఠల ! ఓంకార రూపు డ
వాది విష్ణుండవు హరుడ వీకె
ప్రకృతి పురుషరూప ! ప్రాణికోటిని గాచు
పరమాత్మ ! నిర్గుణ ! భవ్యరూప !
సృష్టికర్తవు నీవె సృష్టి హరుడ వీవె
శ్రీ రమేశ ! సకల సేవ్యమాన !
కలియుగ దైవంబ ! కంజాత దళనేత్ర !
కావుమయ్య విఠల ! కమలనాథ !
దశవిధావతార ! దను జాంతకా ! హరీ !
ఈశ ! భవవినాశ ! శ్రీశ ! దివ్య
పండరీ పురీశ ! పండరీ వల్లభా !
పాండురంగ ఇమ్ము పరము పదము 9

కలియుగంబున విను గాంచని యజ్ఞులు
నిన్ను సందేహింప నీవు కఠిన
శిలగ గా న్పించియు శ్రేయంబు నొసగెదు
విమల తేజోమూర్తి ! విఠలదేవ !

కన్నులు కలవారె కాంతురు నిన్నెప్డు ;
　　కన్నుల ఫలమేమి కాంచకున్న?
చర్మ నేత్రంబుల శక్తి చాలదు చూడ ;
　　సద్భక్తు లై నచో శక్తి కల్గు
శుభము కోరి నరులు శుచిగ, నిన్ బూజింత్రు
శాంతికోరి జనులు సన్నుతింత్రు
ముక్తికోరి ప్రజలు భక్తితో భజియింత్రు
పాండురంగ ! యిమ్ము పరమ పదము　　10

శ్రీ విశాఖ నివాస ! చిద్రూప ! యోగీశ !
　　శివశక్తి  రూప ! యోశ్రీప్రదాత !
వేదవేదాంతాది విద్యాసుగోచర !
　　విశ్వరూప ! రమేశ ! విభవదాత !
పాండురంగ ! విఠల ! పరమేథ ! హృదయేశ !
　　భవభయహర ! దేవ ! భవవిదూర !
సర్వమానవ సేవ్య ! సర్వరక్షక ! హరీ !
　　సర్వలోకారాధ్య ! సత్యరూప !
విశ్వసృష్టికర్త ! విశ్వపోషక ! హరా !
　　సర్వభూత నిలయ ! శాంతిదాత !
జ్ఞానరూప ! విఠల  ! నారాయణా ! స్వామి !
పాండురంగ ! యిమ్ము పరమ పదము.　　11

సాగర తటమున జదునైన చోటున
　　సర్వజనులు నీకు జా గి మ్రొక్కు
సుప్రసన్న విఠల ! శోభాయమానయౌ
　　సుదతితో వెలసితి శుభము నొసగ ;
నీరెండ వెలుగు తో నీరూప దీపింప
　　నిశ్చలమ్ముగ నీవు నిలుతురంగ ;
కరుణా సముద్ర ! నీ కట్టెదుటను గల
　　కడలి లోపలి తరంగము లెసంగి
"రంగ" యనెడు నీదు రంగ దుజ్జ్వలనామ
　　జపమె లేక ప్రణ వశబ్దగతులో

ఉచ్చరించు చున్న పుత్తుంగ భంగుల
పాండురంగ ! యిమ్ము పరమ పదము. 12

నిలువెత్తు నున్న నీ లలిత సుందర విగ్ర
హములకు బారవశ్యమున నేను
మందారదామముల్ మనసార వేయుగు
మహనీయ ! నీ కంఠ మాలికలుగ
సంపెంగదండల జక్కగా గౌ సేతు
సర్వేశ: నీకంఠ సరములు గను
చేమంతి దండల జేతులార గ వేతు
చిన్మయ ! నీగళ సీమ నలర
భక్తితోడ నెన్నొ ప్రసవరాసులు గ్రుచ్చి
రత్నహారములుగ రమ్యమౌన
నీమనోజ్ఞ కంఠ సీమను గీలింతు
పాండురంగ ! యిమ్ము పరమ పదము 13

కర వీరసుమ మాల కమలేశు కంఠాన
కరముజ్జ్వలంబుగ గాంతు నీను
మల్లికా సరములు మాపతి వెడనిండి
భవ్యరీతుల సౌరభమ్ము గురియు
ఎఱ్ఱ గులాబులు నింపుగా ప్రభుగళ
మ్మున నందముల్ చిమ్మి పొల్పుమీఱు
తులసి మాలికలు వితలు గ్రీవ మందు చె
న్నొంది క్రొందళ్కుల గందళించు
పుష్పమాల లెట్టి పుణ్యంబు జేసెనో
నీ గళంబు నందు నిలిచి మెఱసె
ప్రసవమాల లొంది పరమపుణ్యమొసంగి
పాండరంగ ! యిమ్ము పరమ పదము. 14

## భక్తుని ప్రార్థన

పండరీనాథ ! ఓ భక్త మందార ! మ
ద్భవరోగ సంసార బాధలుడుపు
పుండరీకాక్ష ! ఓ పురుషోత్తమా ! పూర్వ
సంచిత కర్మ నడంచు మయ్యి
విఠలేశ ! లోకేశ ! విజ్ఞాన మంతంబు జేయుమా ;
సర్వాత్మ ! యాత్మ దర్శనము నిమ్ము
విఠల దేవ ! నీవు విశ్వంబు నంతయు
నిండి యుంటి వనుట నిజము గనుక
అజ్ఞు డనగు నన్ను నాదరింపవె తండ్రి !
పాండురంగ ! యిమ్ము పరమ పదము 15

ఎన్ని జన్మములెత్తి యిప్డు నరుండనై
ఈశ ! నిన్నెఱి గెదు నెఱుక లేమి
మనుజత్వ మొందియు మందబుద్ధినయితి;
మాధవా ! నిన్గొల్వ మఱపు వచ్చు ;
నీదునామ జపము నిష్ఠతో జేయగా
నీముసంబు నిలువదె నీచబుద్ధి;
భజన వేళల నిన్నే భావింప దలచిన
పాప చిత్త మెపుడు పరువులెత్తు ;
ద్యానవేళ నయన త్వద్రూపముంగాంచ
మర్కటంబురీతి మనసు మసలు ;
నీదు రూపమెట్లొ నీవె చూపింపుమా
పాండురంగ ! యిమ్ము పరమ పదము. 16

భవ సాగరముననే బలు బాధలొంద గా
బలుకక చూతువు భావ్యమయ్య ?
ఆలుబిడ్డలతోడ నగచాట్లు పడుచుండ
ఆదుకొనవె దేవ ! హరిహరాత్మ !
మనుజ జన్మము దీర మనసార గా నిన్ను
ధ్యానింప నేరని యల్పమతిని

మాయలో బడి నేను మందు డనైతిని
మనసు మార్పవదేల ? మాహృదీశ !
భౌతిక తనువు పయి ప్రబలెదు మమకార
మొదవ నేను వ్యథల నొందు చుంటి
తనువు విడుతు నెపుడొ ; దర్శనమ్ము నొసంగి
పాండరంగ ! యిమ్ము పరమ పదము　　　17

కమలేశ్వరా ! నిన్ను గాంచవు కన్నులు
కాంతల సొగసునే కాంచునెపుడు;
నారాయణా ! నిన్ను నామది యరమదు ;
నారీవిలోలమౌ నవయునద్ది
కేశవా ! నీనామ కీర్తనంబును మాని
క్లేశ పాశముల జిక్కినది యెడ ద
మాధవా ? నీరూపు మనసులో నిల్వదు
వేదన మాత్రమే విన్రతి నొందు
భవవిదూర ! నిన్ను భక్తితో గొల్వగా
శక్తినిమ్ము నాకు భక్త వరద !
అభయదాత ! విఠల ! శుభదాయకా ! స్వామి !
పాండురంగ ! ఇమ్ము పరమ పదము.　　　18

ఆలుబిడ్డల తోడ నార్తి గుదెదు మాన
వుడను నిన్నెట్లు నే బూజసేతు ?
ఆశనిపాతము లట్టుల నిశమ్ము వెతలునన్
గూల దీయగ నెట్లు గొల్తునిన్ను ?
అహరహమ్మును జీవితార్థమై శ్రమియంచు
నేనట్లు భజియింతు నిన్ను దేవ ?
సంసారమను ఘోర జలధిలో మున్గుచు
నీనామ జపమెట్లు నేను సేతు ?
ఇన్ని బాధలుండి యేరీతి నీదివ్య
భవ్యమూర్తి నెడద బాదుకొల్పి
భజన సేయ గలను ? పరమాత్మ ! నను బ్రొచి
పాండురంగ ! యిమ్ము పరమ పదము.　　　19

సంగీత సా[స్త్రంబు జక్కగా నేర్వను
        పాట పాడగలన ? పాండురంగ !
తాళలయజ్ఞాన తత్త్వంబు నెఱుగను
        తాళమ్ము వేయ నా తరము కాదు
వీణాది వాద్యంబు లేనాడు గఱవను
        మ[ద్రు విపంచిక నెట్లు మీట గలను
కమనీయ మగు  [వదంగ జ్ఞాన మేసున్న
        యెట్టుల మద్దెల ముట్ట గలను
ఏమియెఱు గ కున్ననేమి ? నిన్మనసార
ధ్యాన నిష్ఠతోడ నేను బూజ
సేయ దలతు [బీతి జేర దీసి కృపను
పాండురంగ ! యిమ్ము పరము పదము.        20

నాట్య[ప్రియా ! నేను నర్తింపలేను ; నిన్
        మెప్పింప నాతరమ్మే ? రమేశ !
నీయర్చ నా[క్రియల్ నే జేయ జాల ; నీ
        దయ బొంద గలను ? నా తం[డి ! విఠల !
క్షీరాభి షేకంబు చేయపలేను ; నీ
        కారుణ్య మెట్టుల గల్గు నాకు
ఆర్ఘ్య పాద్యాదులు హారతి నే నీయ
        గా లేను నీకృప గల్గు టెట్లు
కనుల తోడ నిన్ను గాంచెద సతతంబు
నెమ్మనంబు నందు నిన్నె దలతు
నింతకన్న స్వామి ! యేమి చేయ గలను ఝ
పాండురంగ ! యిమ్ము పరము పదము        21

జపయోగమును సల్ప శక్తి చాలదు నాకు
        జ్ఞానయోగము సుంత నాకు లేదు
రాజయోగమ్మున రాణింప లేనయ్య
        ధ్యాన యోగమునకు దగను నేను
కుండలి నీయోగ కుశలు డ గానయ్య
        భక్తి యోగమ్మును బడయలేను

ఎల్ల యోగంబుల నెఱు గని వాడను
　　నేనయ్య నెట్టులో నీయు పాస
నమును సలుప నేర్తు ; నాకు యోగము లిచ్చు
సత్ఫలముల నీ వొసంగి దేవ !
భక్త వరుల భవ్య పంక్తిని జేరిచి
పాండురంగ ! యిమ్ము పరమ పదము　　22

కానన సీమల గఠిన తపస్సును
సలుప లేనట్టి దుర్బలు డ నేను
కాషాయ వస్త్రముల్ కట్టలేను, మదిని
　　కలుష భావంబులు కలత బెట్ట ;
తీర్థయాత్రల కేగ దీరిక లేదింక
　　తీర్థమహిమ లెట్లు తెలియు నాకు
ఆశ్రమంబుల జేరి యాధ్యాత్మికపు సాధ
　　నల జేయు పద్ధతుల్ నాకురావు
నిన్ను జూచుటదియె నిఖిల తపము నాకు;
నీదు చరణ సేవ నిఖిల పుణ్య
తీర్థయాత్ర నాకు; దివ్య పండరి నాథ !
పాండురంగ ! యిమ్ము పరమ పదము　　23

పాండురంగ ! నిన్ను బండితుండౌ నను
　　పూజింపకున్నచో ముక్తి రాదు
సర్వేశ ! సకల శాస్త్రముల జదివిన, ని
　　న్భక్తితో గొల్వక ముక్తి రాదు
పితలేశ ! వేదార్థ విదులై న నీనామ
　　మును జపింపక యున్న ముక్తిరాదు
కమలేశ ! యెన్ని యోగములు నేర్చిన నీకు
　　మ్రొక్కక యున్నచో ముక్తిరాదు
నామరూపరహిత ! నా స్వామి ! పండరీ
నాథ ! నన్ను గావునశినభాభ !
నిన్నెఱుంగు విధము నీవెతెల్పుము నాకు
పాండురంగ ! యిమ్ము పరమ పదము.　　24

వేదవేదాంగాది విజ్ఞానమును లేదు
శాస్త్ర మెఱు గునట్టి శక్తి లేదు
ఆగమ విధులతో నర్చనంబును జేయ
దలపెట్ట గా నాకు ధనము లేదు
సద్గురు శుశ్రూష సల్పి జ్ఞానము నొంద
నియమ నిష్ఠలకోర్చి నిలువలేను
సంఘ సేవను జేయ సమభానమును లేదు
దీనసేవ లొనర్పు దీక్ష లేదు
భక్తి కూడ నాకు బరిపూర్ణ ముగ లేదు
కామ మత్సరాది కలుష గుణము
లడ గ వెడ దయందు ; హరియించి దోషముల్
పాండురంగ ! యిమ్మ పరమ పదము. 25

నవర్నఖచిత సుందర కిరీటమ్మియ
నిధులు నాకడ లేవు నీరజాక్ష !
బంగారు తొడవులు భక్తితో నీకీయ
శ్రీమంతుడను గాను చిద్విలాస !
బంగారు జలతారు పట్టుపుట్టంబుల
భక్తితో నీకీయ శక్తి లేదు
వెండిపాత్రములు నైవేద్యాదులకు నీయ
ధనము లేశమ్ము హస్తమున లేదు
కనుల నుండి జాఱు కన్నీటి కణముల
కడిగి నీదు పాదయుగమ్ము చిత్త
మనెడు సుమముతోడ నర్చింతు నీమూర్తి
పాండురంగ ! యిమ్ము పరమ పదము. 26

కలిమిలేములు రెండు కావడి కుండలై
గ్రాలెడు చిత్రలోకమున నిన్ను
గలిమితో బూజించ కలవారు గలరు ; ని
శ్చలచిత్తశుద్ధితో గొలుచు పేద భ
భక్తులు గలరిల పండరీపురవాస !
కల్మిలేములు భక్త గణమునందు

సమముగా గనిపించు సర్వేశ ! నీకను
గవకు; భక్తుల చిత్త గతులయందె
కల్మి లేమి చూడ గలవు; పేదల చిత్త
ములను గాఢముగను గలుగు భక్తి
యదియె వారి కలిమి ; యది నీకు హృద్యమౌ;
పాండురంగ ! యిమ్ము పరమ పదము. 27

ఆకలితోనున్న యార్తుల కన్నంబు
పెట్టిన నిన్గొల్చినట్టులె కద;
జలదానమును జేయు జనులు నీ కభిషేక
మొనరించు సత్ఫల మ్మొందగలరు ;
వస్త్రహీనులకును వస్త్రంబు లిచ్చిన
పుట్టముల్నీ మేనగట్టినట్లె;
పేదల కిండ్లిచ్చి యాదరించిన నీకు
గుడి గోపురములు గూర్చినట్లె ;
జగతినాదు కొనెడి సర్వేశ్వరుండవై
అలరుదీవు ; గాననార్త జనుల
సేవయెల్ల నీదు సేవగా దల పవే?
పాండురంగ ! యిమ్ము పరమ పదము. 28

శాంతి కోల్పోయి సుజ్ఞాన ధనులు నిన్ను
సతతమ్ము గొల్వరే శాంతిదేవ !
అఖిల సుఖములుండి ఆపన్నులైన సం
పన్ను లర్పింపరే భక్త వరద !
వేదవేద్య ! విఠల ! విశ్వేశ ! పరమేశ !
మానవాళి వెతల మాపుమయ్య
విశ్వరూపా ! భక్త వితతిని బ్రోచి స
న్మార్గంబు జూపింపుమా రమేశ !
ఈ విశాఖ నగర మెంత పుణ్యమొ చేయ
వెలసితిచట నీవు విఠలదేవ !
సకల దేశభక్త సన్నుతల్వినుచున్న
పాండురంగ ! యిమ్ము పరమ పదము. 29

జగతి నంతయు నింత సొగసుగా సృష్టించి
జనసంతతికినిత్తు సహజమైన
విజ్ఞాన సంపద ; విద్యలు నేర్చియు
విఠలదేవా ! నిన్ను విస్మరింత్రు ;
తామసవృత్తుల దరలకొని తమనాశ
మును గోరుకొందరురు జనులు ధరణి;
ధర్మరక్షక ! శాంతిదూత ! ఓ విఠలేశ !
తనయులు చేసెడి తప్పు దిద్ది
ధర్మబద్ధ జీవితములు ప్రసాదించి
శాంతిసుఖము లిమ్ము సత్యరూప !
విశ్వమంత వెలసి విఠలేశ ! కావుమా ;
పాండురంగ ! యిమ్ము పరమ పదము. 30

సర్వసాక్షి ! విఠల జడమతినగునాదు
కర్మమ్ము లెఱుగంగగలనె నేను
శ్లేష్మంబునందు మక్షోకము కొట్టుకొన్నట్లు
మాయలోబడి నేను మ్రగ్గుచుంటి;
నన్నుద్ధరింపుమా నారాయణా ! దేహ
మునకాత్మభిన్నమై తనరుననెడి
సత్యమైన యెఱుక సంపూర్ణముగ నిచ్చి
విషయములకు నన్ను వేఱొనర్చి
సౌఖ్యదుఃఖ యుగళ సమద్రష్టి సమకూర్చి
పాండురంగ ! యిమ్ము పరమ పదము. 31

విఠలదేవా ! శ్రీశ ! విజ్ఞులు పామరుల్
నిను మ్రొక్కి ఫలములు గనరె వేడ్క !
రోగపీడితలు నిన్ రోజును బూజింప
నారోగ్యమును గూర్తి వార్తిహరుడ !
వర్తకులును నీదు వరివస్యలకు బూన
విత్తము సమకూర్చవే రమేశ !
విధ్యాధికులు నిన్ను వేమాఱు గొల్వ గా
విజ్ఞానమొస గవె వేదవేద్య !

భక్తులెట్లు నిన్ను బ్రార్థింప నీవట్లు
వారి కోరికలను గా రవించి
అలర జేయు దాయురై శ్వర్య సిద్ధులు;
పాండురంగ ! యిమ్ము పరమ పదము. 32

షట్చక్రీభావనా సఫలతకై నిన్ను
బహు విధంబుల గొల్తు బాండురంగ !
కుండలినీ యోగ కుశలునిగా జేసి
భవభయ రహితమౌ పదమొసంగి
శివశక్తు లైక్యంబు జెందునట్లు లొనర్చి
బ్రహ్మ రంధ్రమునందు బ్రభ వెలార్చి
యమ్మృత పానమును మహానుభూతిని జెందు
సాధన మొనరింప శక్తి నిచ్చి
పంచభూతములను బంచ చక్రములందు
హంసరూప శివుని నాజ్ఞయందు
జూపి సప్తకమలముల శోభ నా కెఱింగించి
పాండురంగ! యిమ్ము పరమ పదము. 33

## మ న స్సు

మనసె స్వర్గమనిరి మాన్యులు జ్ఞానులు ;
మనసె నరకమంద్రు ఘనులు బుధులు
మానవహింసను మనుజులు దలకొన్న
మనసె నరకకూపమన గ జెల్లు ;
మనుజ సేవను జేయ మనసె స్వర్గంబగు ;
మనసె నాకు నరకమయముగాదె
మనుజ జన్మమొకటె మహిలోన గొప్పది;
మనుజ వరునియందు మనసె మిన్న ;
మనసు మంచిదగును మాధవు బూజింప;
మంచివాడె మార్చు మహిని దివిగ ;
మనసు గెలిచి నరుడు మాధవ ! విన్గాంచు:
పాండురంగ! యిమ్ము పరమ పదము. 34

కాలులేని నరుడు కదలక జీవించు;
చేయిలేని నరుడు క్షితిని బ్రతుకు ;
కనులు లేని నరుడు గడవు కాలమ్మును ;
మూగవాడ యిలను బుడమి వఱలు;
పిచ్చివా డయినను పృథ్విపై జీవించు
నంఘహీనుడు కూడ నరుడు భువిని;
బ్రతుకు నరుండాత్మ బలమువలన;
నంగమునకు భిన్న మాత్మయే ముఖ్యమౌ;
ఆత్మవలన లోప మంతరించు;
నింద్రియంబులకును నీశుండు నాత్మయే.,
పాండురంగ ; యిమ్ము పరమ పదము. 35

## బ్రహ్మవిద్య

పంచభూతాత్మక ప్రకృతి జయించిన
భక్తవరున కేల భవభయమ్ము
మాయచే జగతి గమలభవు డు సృజించు ;
బ్రహ్మమొకటె నిల్చు; ప్రకృతియంత
రించు; నిత్యము ప్రకాశించుచు సత్యమౌ
బ్రహ్మ భావమొస గు బ్రహ్మపదము;
జనన మరణములు సమయ, మునీంద్రులు
బ్రహ్మ మెఱిగ బ్రహ్మభావము తెల్పు
బ్రహ్మ తత్త్వమెఱి గి బ్యహ్మభావము తెల్పు
బ్రహ్మవిద్య గఱపి పరమ ఋషులు
మోక్షపదము జూపి ప్రోవరే మనుజుల !
పాండురంగ ! యిమ్ము పరమ పదము. 36

ఐహికమగు విద్య యాపదల్గొని తెచ్చు
బ్రహ్మ విద్యయె చూపు బ్రహ్మపదము;
పదవులొంది నరుడు పాపంబు లార్జించు
పాపవర్జితమగు బ్రహ్మపదము ;

అట్టి పథము జూప నర్హుండు గురుడె ; త
ద్బ్రహ్మవిద్య గఱపి బ్రహ్మపదము
తగు నొసగు తపోవిధానమ్ము దెలిపెడు
సర్వదేవమయు డు సద్గురుండు
గురుని మించువాడు కువలయంబున లేదు;
పాండురంగ ! యిమ్ము పరమ పదము 37

బ్రహ్మ మెఱిగినట్టి బ్రహ్మస్వరూపులు
సకల యుగములందు సంచరింత్రు
జీవులెల్లరు నిత్య చేతనాయుతులౌట
బ్రహ్మరూపులనిరి పరమ మునులు;
జీవమే బ్రహ్మమై చెన్నారు జీవుడ
జ్ఞానియై యెఱుగడా సత్యసూక్తి
దేహమ్ములో జీవదివ్యత్య మెసగును
దేహమాత్మము కాదు; తెలిసికొనిన
దేహమబ్బురంపు దేవాలయమ్మగు
జీవుడందు వెల్గుదేవుడగును;
బ్రహ్మ భావమీవె పరమేశ! విఠలేశ
పాండురంగ! యిమ్ము పరమ పదము.

## గర్భనరకము

మాతృగర్భమునందు మలమూత్రములలోన
మసలుచుండును జీవి మందు డగుచు;
గర్భనరకమందు దర్భరమగు గష్ట
ముల గ్రుగ్గి నవమాసములను జీవి
ప్రారబ్ధసంచిత బద్ధుడై కుములుచు
బైటపడెడు దాక బాధలెల్ల
భరియించి వేదనడపుచుండు సతతమ్ము
మనసులో బరమేశ్వరుని దలంచి;

తల్లి గర్భమందు దన పాపముల నెల్ల
శిశువెఱుంగ గలడు చిత్తమందు
మహిని వ్రాలి లోకమాయకు లోబడు
పాండు రంగ! యిమ్ము పరమ పదము 39

మలమూత్ర దుర్గంధ మాంసయుతంబైన
మాతృ గర్భమునందు మసలు చుండి
క్రిమి కీటకాదుల సముదయంబు నడుమ
క్లేశ భావముతోడ ఖిన్ను! డగుచు
మాతృభక్షిత సాంద్రమాలిన్యమున మాంస
పిండమై జీవుడ ఖండమైన
కఠిన యాతన గుఱి గ్రాగుచునుండి
యంధకారమున మహాధినొంది
మాతృగర్భమందు మరల దా బడకుండ
నుద్ధరింపుమనుచు నుర్వి దాను
బడెదుదా క దేవు బ్రార్థించు జీవుండు;
పాండురంగ! యిమ్ము పరమ పదము 40

తల్లిగర్భమునందు దా బడ్డ కష్టముల్
మఱచు జనన మొందు తదిని నరు డు ;
దివ్య తపస్సుచే భవ్య తాపసవరుల్
గర్భ నరక బాధ కల్గకుండ
బ్రహ్మపదము నొంది పడసిరి మోక్షంబు;
తుచ్ఛ సుఖము గోరు దుష్ట జనులు
మాతృ గర్భము నందు మరల వసింతురు
పాప కర్మల పరంపరల వలన;
జ్ఞానహీనులయిన జనులు మసలుచుంద్రు
మాతృ గర్భములను వరల మరల;
జ్ఞానులైనవారు సాధింత్రు ముక్తిని
పాండురంగ! యిమ్ము పరమ పదము. 41

## భౌతిక శాస్త్రము

భౌతిక సూత్ర సంబంధ శాస్త్రములతో
భువిని మానవదీప్తి మివుల బెరిగె
ప్రకృతి మహత్తర పరిశోధనలు చేసి
సుఖమెందె నరుడు విస్తులు విధాన
యంత్రాంగములచేత నాహీర వృద్ధిని
సమకూర్చుకుని జీవితమున వఱలె;
భూపయోధుల దాటి భూనభోంతర వాయు
వీధులలో గూడ విహృతి సల్పె;
ఎంత యెంతయైన నీ నాటి విజ్ఞాన
మంతయు మనుజునకహంత పెంచ
నిన్ను జూడలేదు నిశ్చల జ్ఞానియై;
పాండురంగ! యిమ్ముపరమ పదము.

## ఆధునిక లౌకిక జీవితము

ఐశ్వర్య కాములైనట్టి యాధునికుల
యాధ్యాత్మ జిజ్ఞాసనసలె మఱచి
"సర్వజ్ఞులము మాకు సాటి ప్రాచీనులా"
అని పూర్వ శాస్త్రంబులందు నున్న
యతిలోకమూల విద్యల దిట్టిపోయుచు
షడ్దధర్మముల సారమేమొ
తెలియనివారలై యలనా టి వేదభూ
మిని వసించిన దివ్యమునుల దెగడి
మనుజహాని గూర్చ మారణాస్త్రంబుల
గనినయట్టి వారె ఘనులు - విజ్ఞు
లనుచు నుంద్ర నేటి యల్పు లజ్ఞానులు
పాండురంగ యిమ్ము పరమ పదము
భౌతిక శాస్త్రావల్ల బుట్టెడు, నేడు
గ్రాహ్యమ్ముగాని రోగమ్మ లెన్నో!

సామాన్యమగు వ్యాధి నేమాత్రమును మాన్ప
దరమె యాధునిక వైద్యమున కెల్ల?
ప్రాచీన కళలతో బ్రకటితమైనట్టి
నేర్పున్నదే చూడ నేటి కళల?
మనుధర్మ సూత్రములను దూఁలనాడిన
నరులకు నీతి యీ నా డు కలదె?
పూర్వజనులకున్న పుష్టియు తుష్టియు
ఆధునికులయందు నరయ గలమె!
నిజము పూర్వమునకు నే డీడు కాబోదు;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 45

పృధ్విలో ఖనిజముల్ పెకలించి? ఖనిజనం
పద గూర్చి మనుజు డభ్యుదయమందె
సప్త సముద్రాల సాధించి నావిక
విజ్ఞానమును నేర్చి వేడ్కతోడ
వైమానిక ప్రజ్ఞ పరిఢవిల్ల గ నభః
పథముల విహరించె నధికుడగుచు
మానవజాతిని మంట గల్పగ జాలు
విలయాస్త్రములగూడ వెలువరించె
నిన్నిచేసి మనుజు డిసుమంతయైనను
ఆత్మతత్వ సారమవల బ్రహ్మ
తత్త్వమరయు శక్తితనలోను లోపించె;
పాండురంగ! యిమ్ము పరమ పదము 46

సజ్జనుండెప్పుడు సత్పథమ్మును ద్రొక్కి
మతసమత్వమ్మున మసలు చుండ
మతభేదమును జూపు మనుజ వర్గములున్న
నరజాతి జగతిలో నాశమగును;
మంచి మార్గమ్ము సమ్మతమౌను ప్రతిమత
మ్మునకును భేదభావనయె తగదు
“మతి పిచ్చి” యున్నచో మనలేరు మానవుల్
వారి నాశమొనర్చు వారి మతమె

మతములెల్ల గూర్చు మానవ శ్రేయస్సు
మంచి నెఱు గవలయు మతములందు
మతములెల్ల దెల్పు మహినొక్క దేవుని;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 47

ఆధ్యాత్మిక జ్ఞాన మనిశంబు పెంపార
సర్వమానవ శాంతి సౌఖ్యములకు
ప్రాచీన మునివరుల్ బహువిధానమ్ముల
చాటి యుండిరి నిత్యసత్యములను;
వేదపురాణాది వివిధ సద్గ్రంథస్థ
పరమార్థముల మునుల్ పరుల కొఱకు
బంచి పెట్టిరి నాడు భారతావని బావ
నార్ష సంస్కృతి మహోత్కర్ష దొడర;
అట్టి పుణ్యభూమియైన యీ గడ్డపై
బరులు కుటిలబుద్ధి పరగ నన్య
మతములకును దావు సతముగల్పించిరి,
పాండురంగ! యిమ్ము పరమ పదము. 48

ఈనాడు మానవులెందరో వెలిసిరి;
ఆస్తికులన్నచో నాగ్రహమ్ము
వెలిపుచ్చుచును సభా వేదికలను నిల్చి
దేవుడులే డంచు దీర్ఘమైన
వాగ్ధారతోడ నుపన్యాసముల బ్రజా
సమితిని మోసపుచ్చంగ జూతు
రట్టి మనుజవర్గ మబ్బురమ్ముగ నేడు
నీ పైని వైరమ్ము నెఱపుచుంద్రు
సత్యదూరులగు నసత్యవాదుల మనో
భావములను మార్చి భక్తి నొసగి
వారి బ్రోవుమయ్య పంకజాక్ష! విఠలేశ!
పాండురంగ! యిమ్ము పరమపదము! 49

సద్గ్రంథముల శ్రద్ధ జదువక మన పురా
ణముల దూషించెదు నరులు నేడు
స్వమత విద్వేషులై పరమత జాలమ్ము
ధుషించుచుందురు; దూషణమును
భూషణమ్మును మాని పుణ్యమార్జింపగా
మంచి పని దలంప నంచితముగ
తన యింటి కూరకన్నను బ్రక్కయింటి కూ
రను మెచ్చుకొన్నట్టు తనదు ధర్మ
పథము వీడి యన్య పథములు శ్రేష్ఠమ్ము
లనెదు స్వార్థపరుల యజ్ఞత విఠ
లేశ పారద్రోలి యిమ్ము సుజ్ఞానమ్ము
పాండురంగ! యిమ్ము పరమపదము. 50

జార చోరాదుల సరణి చాతుర్యమ్ము
నెఱపి సంపద తోడ నెగడనేల?
జార చోరగుణము జగదీశ! హేయంబు
తప్పు చేయవలెనె ధనము కొఱకు
ధనదు డౌ నీవు డ ధనమునకై నీచ
కార్యమ్ములను జేయ గడగ నేల?
పలు సంపదల వల్ల బాడు బుద్ధులు కల్గి
విఠల! నిన్ను నరులు విస్మరింత్రు
విత్తమొకటెయున్న జిత్తశాంతి యెటుల
గలుగు శ్రీశ! నిన్ను గొలువకున్న
ధనమదాంధు డైన జనుడు నిన్ ద్వేషించు;
పాండురంగ! యిమ్ము పరమపదము 51

తారుణ్య రేఖలు తళుకొత్త దనువున
లలిత కోమల లతాంగుల విశేష
ముగ్ధ లావణ్యమ్ము మొగపడ పురుషులు
దాసాను దాసులై తనువు మరియు
మనసు నర్పించియు దనము వెచ్చింతురు
మగువ యన్న నమిత మమత గలిగి;

ముక్తి నొసగు నిన్ను బురుషోత్తమా! నరుల్
భక్తి గొలువలేరు పాపమతిని;
తనువులుండ గానె! దమశమాదులతో
దపము చేసి నిన్ను తథ్యముగను
పొందగోరు నరుల కందీయవే ముక్తి;
పాండురంగ! యిమ్ము పరమపదము. 52

పండరీనాధుని భజియింప నేర్వని
మనుజుని కంటెను మ్రానుమేలు;
పాండురంగని పాదపద్మాలు కొల్వని
చేతుల కంటెను శిలలు మేలు;
విఠలేశు మహిమలు వేమాఋ పొగడని
నరునికంటె విషపు నాగుమేలు;
పాండురంగని పూజ భక్తితో జేయని
పాపికంటెను గడ్డిపరక మేలు;
నీరజాక్షుగనని నేత్రంబుకంటెను
గ్రుడ్డి గవ్వమేలు; కోరి శ్రీశు
దలపనట్టి మనసు కలుష భూయిష్ఠమౌ;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 53

సంతాన లబ్ధికై కాంతను బెండ్లాడి
పురుషార్థముల గామమునకు లోగి
కామినీ బంధుర వ్యామోహమున జిక్కి
యఖిలశ! నీ పూజలందు విముఖు
డై పాపకృత్యము లాచరించుచు సత
మ్మజ్ఞానియై జీవితాంత నిబిడ
సంసార సంక్లేశ జలధిలో మునిగెడు
కలుషాత్ము డెటుల మోక్షమ్ము గనును?
కాంతయందు మమత కల్గిన నరునకు
మరల మరల కల్గు మనుజ జన్మ
నిన్ను గొల్చునేని నిక్కంబు మోక్షంబు;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 54

జననంబు దుఃఖంబు; జరయును దుఃఖంబు
జాయయు దుఃఖంబు; జగతియందు
సంసార మొసగును సతతంబు దుఃఖంబు;
మనుగడయే దుఖఃమయము దేవ!
దుఃఖము లన్నిటి దుద ముట్టగా జేసి
జన్మరాహిత్య మొసంగి పరమ
శాంతిని జేకూర్చు సర్వేశుడవు నిన్ను
గొలిచిన గ్లేశంబు తొలగిపోవు;
భక్తవరద! నాకు వైరాగ్య భావమ్ము,
నిచ్చి నాదు మనసు విచ్చి నిన్ను
గనగజ్ఞానదృష్టి నొస గూర్చి పెరిమతో
పాండురంగ! యిమ్ము పరమ పదము. 56

భాగ్యముండియును నారోగ్యముండదు భువి
నైశ్యర్యవంతుల కనుభవింప;
విద్య యుండియు సుంత వినయముండదు విద్య
సత్ఫలియుక్తమై సాగుకొఱకు;
రూప ముండియు నెద పాప భూయిష్టమై
పరకామినుల పైని భ్రాంతి చెందు;
పదవి యుండియు నరుండధికార మదముచే
విద్యుక్త ధర్మంబు విస్మరించు;
నొక్క కిరిని జెఱచు నొక్కొక్క లోపంబు
మనుజులందు వీని మాన్ని చక్క
నైన గతుల నడుపు మానవజాతిని
పాండురంగ! యిమ్ము పరమ పదము. 57

అవసాన కాలంబునందు నీనామ సం
స్మరణ మొనర్తునో సల్పవేనొ
జవసత్త్వములు నాకు జక్కగా నున్నప్డె
నోరార భక్తి నీపేరి దల ప
నే నెంచెదను జ్వామి! మే నస్థిరముగాన;
ఏవేళ తనువున కెట్టికీడు

మూడునో నీకప్డు మొరపెట్ట నాలోన
శక్తి కల్గునొ లేదో సంశయింతు;
కాయ మున్నయపుడె కనులార నీ కమ
నీయమూర్తి నే నమేయ భక్తి
గాంచి హృదయపీఠి గై సేసెదను నిన్ను
పాండురంగ! యిమ్ము పరమ పదము. 58

మనుజ కుటుంబములను దల్లిదండ్రులు
తనయులు వంశపాదమునందు
ముఖ్యశాఖలు, తండ్రి మూర్ఖుండై యైనచో
దారసుతులు కూడా దప్పకుండ
మూర్ఖులౌదురు; సాధు పుంగవుడైనచో
శోభిల్లెదరు సతీసుతులు గూడ;
తొలియేరు సాగెడు త్రోవనే మలియేరు
చనునన్న యార్యోక్తి సత్యమౌను;
తల్లిదండ్రులకును దనయులకును నీవు
జ్ఞానదీప్తి నొసగి న్యాయపథము
నెరపి సర్వజనుల గరుణింపపుమా దేవ!
పాండురంగ! యిమ్ము పరమ పదము 59

లోకమ్ములో బ్రజానీకమ్ము లఘుముల
నొనరించుటకును హేతువును గ్రహింప
గాంతయు గనకంబు కారణంబులు కదా!
వనితపై వ్యామోహమును వహించి
నట్టి మానవుడు నిన్నర్పింప దలపడు;
బంగారుపై గూడ భ్రాంతియున్న
నరుడెన్నడును నీకు గరముల మోడ్వడు,
శత్రువులే వారు సంఘమునకు
నిన్ను మనసుదీర సన్నుతింప గనేను
గోరుచుందు, నాకు బోమలియన
గనకమన్న మదిని గాంక్షరానీయక
పాండురంగ! యిమ్ము పరమ పదము. 60

సమభావ మొసగని చదువులు చదువులా?
సమత నేర్పనియట్టి చదువులేల
శాంతి లేని మనుజ సంఘంబు సంఘమా?
అట్టి మనుజ సంఘ మదియునేల?
సత్యవ్రతములేని జనులిల సృజనులా?
అట్టి మానవ నివహంబు లేల?
చిత్త శుద్ధియె లేని శీలంబు శీలమా?
అట్టి కపట శీలమదియునేల?
సమత శాంతిశీల సత్యవ్రతంబులు
నాకొసంగుమయ్య నళిన నయన!
సజ్జనుండ నగుచు సాగింతు నీ పూజ;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 61

ప్రకృతివల్ల సహజ భాగ్యమ్ములుత్పన్న
మయ్యెడు బ్రజల శ్రేయస్సు కొఱకు;
నట్టి సంపదలెల్ల నైశ్వర్య వంతులే
యనుభవింతురు స్వార్థమతిశయిల్ల
కేలితో నొక్క యెంగిలి మెతుకైనను
కాకికి రాల్పని కఠినచిత్తు
లన్నార్తులను జూచి యాదుకొందురె? మాన
సమ్ములు సైతమార్ద్రమ్ములగును?
అట్టి లోభుల కట! యధిక సంఖ్యను నేడు
లోకమందు కలరులోకములను
బ్రోచు విఠల! లోభమును బాపు కరుణతో
పాండురంగ! యిమ్ము పరమపదము. 62

## మతము

అన్ని మతములందు నార్షమతమె మిన్న
యని మేక్షముల్ల రే యన గలేదె?
అన్ని దర్మంబులకన్నను మనుధర్మ
మధిక మంచనిబిసెంటన గలేది?

హైందవ వైవాహికాచార విధులను
పూజ్యుడు రస్సెలు పొగడలేదె
మన సంస్కృతియె గొప్పదనియన్య సంస్కార
కోవిదుల్ భువిమెచ్చుకొన గలేదె
సాటిలేని యార్ష సంపుల్ల ధర్మంబు
వీడనట్టి యీ పవిత్రజాతి
పరుల జూచి సిగ్గుపడనేల? జగదీశ!
పాండురంగ! యిమ్ము పరమ పదము. 63

మన జాతియును మతమ్మును సంస్కృతియువాసి
కెక్కి నవని వేఱెనొక్కి చెప్ప
నేల? యీ ధర్మమ్ము నిట్టులే సాగించి
మాతృదేశముపైని మమతనునిచి
యీ వేదభూమిపై నీవు నిల్చినచోట
పుణ్యస్థలమ్ముగా బూజ్యభావ
మూని నిన్ననిశంబు జ్ఞాననేత్రంబుతో
నర్చింప మాకిత్తువ భయమీవు
చిరతపస్సు మనులు చేసి తీర్చినయట్టి
యీ పవిత్ర మతము నీయమేయ
ధర్మమును సతమ్ము దయతోడ నిలబెట్టి
పాండురంగ; యిమ్ము పరమ పదము. 64

## శ్రీ గురు మహాత్యము

అజ్ఞానయుతులైన యాశ్రిత శిష్యుల
యజ్ఞానమంతయు నంతమొంది
నాధ్యాత్మికజ్ఞాన మందజేసెడి వాడె
యఖిల శక్తియుతుడు నాప్తగురుడు;
గురువును మెప్పింప గుణశాలి శిష్యుండు
గురుపాద యుగళంబు గోరికొల్చు;
శుచియౌచు గురునకు శుశ్రూష యొనరించి
సుస్థిర ఫలముల జూర గొనుచు

గూఢమైన విద్య గురుముఖమ్మున నేర్చు;
గురుడెదేవుడంచు గొల్చునతడు
బ్రహ్మపదము నిచ్చు భవ్యగురుపదమ్మె;
పాండురంగ! యిమ్ము పరమ పదము 65

సంయమిప్రవరుండు చైతన్య వంతుండు
సాక్షాత్పరబ్రహ్మ సద్గురుండు;
బ్రహ్మాండమంతయు బరికింప జాలెడు
సర్వశక్తి యుతుండు సద్గురుండు;
సర్వజీవులయందు సమభావమును గల్గి
సర్వదా మసలెడు సద్గురుండు;
సత్త్వప్రధానమౌ తత్వదృష్టిని దమో
జగతి వెల్గించెడు సద్గురుండు;
సద్గురుండె యిచ్చు సచ్చిదానందంబు
బ్రహ్మభావ మొసగు బరమ గురుడు
నరుని జీవితాబ్ధి తరణి సద్గురు డౌను;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 66

సచ్చిదానందుండు సర్వధీసాక్షియు
నచలాత్ముడు పరమహంస గురుడు;
వాజానసంబులు వచియింపజాలని
త్రిగుణరహితమూర్తి దివ్య గురుడు;
అజ్ఞాన తిమిర సమ్యత్ప్రభాసాంద్ర సు
జ్ఞానాంజన శలాకకా డె గురుడు
సద్గురు మంత్రంబు సర్వదా జపియింప
బ్రహ్మపదసుఖము ప్రాప్తమగును
నైజముగను గురుడు నాదబిందుకళా వి
శిష్టుడగుచు సతము చిన్మయుడయి
ద్వంద్వ రహిత దృష్టి ధ్యానగమ్యుండగు;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 67

## శ్రీ పాండురంగని మహిమలు

పాండురంగ! విఠల! భవభయహర! మోక్ష
దాత! కలియుగాన దైవమీవె;
రంగ! నీభజనంబు రానీదు హానిని;
విష్ణురూపుడవీవె విఠల! భువిని
అఘసంచయంబుల హరియించి నరకోటి
నాదుకొనగజాలు హరివి నీవె
అక్షరంబగు పరమాత్మవు నీవె భూ
తలముపై నీయవతార మెత్తి
పాండురంగ! యంచు భక్తితో బిల్చిన
భక్తజనుల కెపుడు ప్రాపునిచ్చు
పట్టుగొమ్మ వీవు పండరీ హృదయేశ!
పాండురంగ! యిమ్ము పరమ పదము 68

కమలేశ! నిన్గొల్వ గామమోహాంబులు
గడముట్ట జేసి మోక్షము నిడుదువు;
కువలయేశా! నిన్ను గొల్చిన గ్రోధమ్ము
కూకటి వేళ్లతో బీ కివెత్తు
లోకేశ నిన్గొల్వ లోభంబు పోకార్చి,
యుజ్వల సాయుజ్య మొసగుదీవు
మాధవా! నిన్గొల్వ మదమును బెకలించి
దివ్యత్వమును ప్రసాదింతువీవు
పండరీశ! నిన్ను భక్తితో గొల్చిన
మనసులోని గాఢమత్సరమును
దునిచి పరమశాంతి నొసగూర్చెదవు ప్రభూ!
పాండురంగ! యిమ్ము పరమ పదము 69

పెక్కు శాస్త్రముల విభిన్న మౌరీతుల
బ్రహ్మాది తత్వభావముల వెలయ
బ్రాంతితో నందలి పరమార్థ మెఱుగక
సందేహములు మానసమున విడక

తన పురోగతియు మందముగా జంకుచు
మందుడై సన్మార్గమందు బోక
చేయదగిన దేదొ చేయరానిది యేదో
యెఱుగక యజ్ఞాని యిడుమలొందు
భక్తులైనవారు బ్రహ్మతత్వ మెఱుగ
శ్రమను జెందనేల? సర్వవీఎవె
తెలియజెప్పగలవు తెలివి ప్రసాదించి;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 70

జపత పోధ్యానముల్ శ్రద్ధతో జేయగా
మనసు నిల్వదు నాకు మానవుడను;
మాయ నధిగమంచి మమత వీడగలనె?
నిత్య సత్యుడవైన నిన్ను నొక్క
సాయిఁ దలపును; సంసార బంధమ్ము
సతతమ్ము నాకు నశాంతి గూర్ప
జిత్త విభ్రమముతో జీకాకు పడుచు, నే
నాత్మ తత్త్వము నెట్టులరయ గలను?
నిగ్రహమ్ము లేని నేనెట్టులో కేలు
గవనుమోడ్చి నీదు క్రమమైన
మూర్తి యెదుట నిలుత మోక్షమ్ము నర్థించి;
పాండురంగ! యిమ్ము పరమ పదము 71

సర్వలోకములందు సర్వదిక్కులయందు
సర్వేశ నీ మహాశక్తి నిండి
అర్కచంద్రాది విశ్వాంతరాళము నెల్ల
చైతన్యయుతముగా సల్ప నీవు
ప్రసరించెదవు గదా! వాయు దేవుండును
నీ శక్తిచే వీచు; నీదుభవ్య
మహిమచే వరుణుడు మహిని వర్షించును;
నీ తేజమున నగ్ని నెగడు శిఖల;

సర్వభూతములను సంచరించెదవీవు;
క్షితిని బర్వు సర్వ జీవులకును
ప్రాణదాత వీవు; పరమేశ! విఠలేశ
పాండురంగ! యిమ్ము పరమ పదము 72

సర్వవేదంబులు సర్వంబు నీవన
సర్వ వేదంబుల జదువనేల
సకల శాస్త్రంబులు సకలంబు నీవన
సకల శాస్త్రంబుల జదువనేల?
నిఖిల పురాణము ల్నిఖిలంబు నీవన
నిఖిల పురాణముల్నేర్వనేల?
అఖిలాగమంబులు నఖిలంబు నీవన
నఖిలాగమంబుల నరయనేల?
నిన్ను జూడనెంతు నీరూపు జూడగా
శక్తి నిమ్ము దాన సర్వవేద
ములను సర్వశాస్త్రములు నాకు నబ్బెడు;
పాండురంగ! యిమ్ము పరమ పదము 73

అక్షరుండవు నిన్ను నక్షరాల్దెల్పునా?
వాక్కులెట్లు తెలుపు నాగతీత!
అర్థబోధ తెలుప దాద్యంతరహితాత్మ!
నీవతీతుండవు భావమునకు;
గ్రంథరూపమ్మున గననౌన కమలేశ!
దివ్యమౌ నీ మహాతేజమెల్ల?
సర్వశాస్త్రంబులు సర్వభాషలు కూడ
వర్ణింప గలవె నీపూర్ణ మహిమ?
శబ్దనాదరూప! సర్వేశ లోకేశ!
గానరాగరూప! ధ్యానగమ్య!
ప్రణవమూర్తి! దేవ! పరమేశ! జగదీశ!
పాండురంగ! యిమ్ము పరమ పదము! 74

"అష్టాంగ యోగంబు నభ్యసింప గ లేక
యాయస పడనేల యార్కులార!
పాండురంగని పాపద్మము ల్సేవింప
బ్రహ్మపదము కల్గు ప్రాజ్ఞులార!
ఆత్మార్పణము జేసి యర్చించు భక్తుల
కానంద సుధనిచ్చి యాదుకొనెడు
కలియుగ దైవమ్ము కద! పండరీశుండు
భజన సేయ గ రండు భక్తులార!"
అంచు నీదుభక్తుల నవరతమ్మునిన్
గీర్తనములు బొగడి నర్తనముల
బరవశించుచుంద్రు పరమేశ! లోకేశ!
పాండురంగ! యిమ్ము పరమ పదము. 75

విశ్వరూపుడ వీవు; విశ్వాత్ముడవు నీవు;
విశ్వసృష్టి నొనర్చు విభుడ వీవు;
విశ్వపోషకుడవు; విశ్వగర్భుడవు; వే
దస్వరూపుడవు; సత్త్వప్రకాశ
కలితుండవీవు; లోకమ్ముల నెల్లను
వెలిగించు ధీప్తివి; విశ్వరక్ష
కుడవు; విశ్వాంతరంగు డవీవు; లయకారి
వీవు; విశ్వేశుండవీవు; స్వామి!
యీ విశాఖలోన ఈ పూర్వసాగర
తటమునందు సైకతమున శిలగ
నిల్చి, నీధుభక్త నివహమ్ము బ్రోతువు
పాండురంగ! యిమ్ము పరమ పదము 76

కనులు మూసిన నీవె కనులు విప్పిన నీవె
కాయంబులో నీవె కానబడెదు
కకుబంతముల నీవె గగనమందును నీవె
కడలియందును నీవె కానంబడెదు
నదనదీ జలముల నగశృంగ సీమల
గహనమ్ములను నీవె కానబడెదు

సర్వశూములయందు సర్వభూతములందు
ఖగమృగమ్ముల నీవె కానబడెదు
సర్వసృష్టియందు సంచరింతువు దేవ!
సర్వసృష్టి నీవు సలిపియందె
సర్వ రూపములను సాక్షాత్కరింతువు;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 77

నీ దయ లేనిచో నిల్వగల్గునె ప్రాణి
కాలు సేతులయిన గదపలేదు?
నీకృప లేనిచో నీరు త్రావునె ప్రాణి?
గొంతు మెదపలేదు సుంతయైన;
నీదయ లేనిచో నిబ్బరమ్ముగ గాలి
పీల్చునే? యూపిరి విడువలేదు;
నీకృఫ లేనిచో నేకాలమున బ్రాణి
పుడమిపై బ్రతుకునే? మఱియు గాక;
ప్రాణవాయువీవె ప్రాణులన్నింటికి,
ప్రాణరక్షకుడవు పాండురంగ!
ప్రాణికోటి బ్రోచి పాలింపవే తండ్రి!
పాండురంగ! యిమ్ము పరమ పదము. 78

సంసార బంధముల్ సతము పీడింప నా
బంధముల్ వీడు నీవలన దేవ!
కామలోభాదులు గల్గింప నార్తి., నా
వ్యథ మాసిపోవు నీవలన స్వామి!
దుష్ట చేష్టలు నన్ను దుర్జను జేయ, నా
దౌష్ట్యంబు నీవల్ల దఱుగు విఠల!
కన్నుల గర్వాంధకారము గప్ప, నా
గర్వముడుగు నీదు కరుణ వలన
గేస్తులయిన గామకేళి నెసంగెడు
పురుషులయిన దుష్టపురుషులయిన
కేలు మోడ్తురేని కృప జూపి ప్రోచెదు;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 79

నీనా మీ జపముచే నిష్ఠ చేకూర గా
తన్మయు లగుచును దసరు బక్త
బృందమ్ములను బ్రోచి బంధంబులను బాపి
భవభయంబును గూడ బార ద్రోలి
యంతరంగమ్ముల నాత్మరూపుండవై
యనయమ్ము భక్తుల కానతిచ్చి
నడిపించెదవు దేవ! యుడినోవి ప్రేమతో
నడుగడుగున మందహాస మొలికి
భక్తవరద! విఠల! భక్తుల కెల్లకా
లముల నీవు బహుసలభుండ వంచు
బేరుమోసినాద వోరమా వల్లభా!
పాండురంగ! యిమ్ము పరమ పదము. 80

నీసృష్టి వివరింప నే నసమర్థుద
సృష్టికర్తవనెడు దృష్టితప్పు;
పంచభూతములతో భౌతిక దేహంబు
పర గ జేసితివి సుందరము గా గ;
పంచవాయువులతో బ్రాణమ్ము వోసియు
నింద్రియ ప్రతితి నిస్తంద్ర గతిని
కల్పించితివి; జ్ఞాన కర్మేంద్రికయములను
బంచతన్మాత్రలు పర గజేసి
అనయ మొసగితీవు మనసును బుద్ధిఇని
చిత్తమును నహంత జీవకోటి;
కాత్మనొసగి నీవె యాత్మవై యడరెదు
పాండురంగ! యిమ్ము పరమ పదము. 81

సర్వ సంపత్తిని సర్వజీవులకిచ్చి
యాత్మకర్మ ఫలంబులంద టొంద
శాసనంబును జేసి సర్వే! క్రీడింతు;
బ్రహ్మరుద్రాత్మక! బ్రహ్మతేజ!
విష్ణుదేవడవీవె వెలయుదు విలలోన
ధర్మరక్షణము భూస్థలి జెలంగ;

జ్ఞాన మొసగితీవు నరునకు దరియింప
సత్కర్మముల జేయ జగమునందు
ఊర్ధ్వలోకములను నుత్తమ స్థితినుండ
నీవె రక్షకుడవు నిఖిలమునకు;
నిన్ను మఱచువారు నిర్భాగ్యులేకదా!
పాండురంగ! యిమ్ము పరమ పదము. 82

నారాయణా! నీవె నాదమయుండవై
బ్రహ్మాండమంతట బర గుచుంటి;
వీచరాచర సృష్టి నెనలేని నైపుణ్య
మున జేసి వాగ్రూపమున వఱలెదు;
పశుపక్షికీటక వ్యావృత్తి నవ్యక్త
నాదమ్ముపై బ్రాలి నరులయందు
వ్యక్తమ్ముగా బుద్ధియుక్తముగా దివ్య
నాదమ్మవగుచు సంతత్వము సృష్టి
నిండి యుండెదీవు నిఖిల నాదబ్రహ్మ
రూపమొదవ నరులు నీపవిత్ర
నామముల నుపాసనము సేయగాదేవ!
పాండురంగ! యిమ్ము పరమ పదము. 83

నిఖిల లోకంబుల నీవె సృజించుచు
నిఖిల కర్మంబుల నీవె చేసి
కర్మఫలంబుల గాచవెన్నడ నీవు;
కర్మ సూత్రంబుచ గల్గె జగము;
అన్ని జీవుల యాత్మలందు బ్రహ్మము నీవె;
ఆనందమయుడ! సర్వాత్మరూప?
భువన సృష్టియెల్ల బూటకమ్మగు నాట
కమ్ము; నీవు నటుడుగా నటింతు;
వదియె నీకు వేడ్క రుగు గాదె పరమేశ!
పాండురంగ! యిమ్ము పరమ పదము. 84

కోటి సూర్యప్రభల్ కూర్చిన తేజస్సు
నీలోన వెలుగొంచు నివ్వటిల్లు;
అంతములేని చంద్రాదిత్య కాంతులు
కొల్లగా నీలోన వెల్లివిరియు
సంఖ్యకు మించిన జలనిధుల్ కరుణ ర
సమ్ములై నీలోన ముమ్మరించు;
నంతు చిక్కని భూనభోంతర మాదిమ
ధ్యాంతర హితుడ! నీయందు నొదుగు;
శక్తిమంతమైన సర్వప్రకృతి నీయ
నంత శక్తి బుట్టి యంతరించు;
లీలగా దిరిగెడు కాలచక్రమ్మవు!
పాండురంగ! యిమ్ము పరమ పదము. 85

పాండురంగ! విఠల! ప్రభవించితీవిల
పరమ భక్తువరుల బాధ బాప,
సర్వేశ్వరుడవీవె సర్వంబు నందుండి
సర్వ శక్తులు చూపు సర్వహితుడ!
భక్తి ప్రపత్తితలో భజన చేసెదు జన
వ్రాతమ్ము గాచెదు భక్తవరద!
పాపకర్మలు గూడ భవదీయ మూర్తిని
భావింపనిత్తువు పరమశాంతి;
భాషయేదియైన బ్రతిబంధకముగాదు;
దేశమేదియైన ఈశ నీదె
దిక్కునీవెయగుదు! దీను బ్రోతువు;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 86

సర్వసృష్టిని సల్పిసర్వేశ్వరా! నీదు
దృష్టియై; సృష్టవై! సృష్టినిల్పి
హృష్టుండవై; సర్వసృష్టియు నీవయై;
సచ్చిదానంద భాస్వత్స్వరూప
విశ్వతేజోమయ! శశ్వదనంత నా
దబ్రహ్మవిలసితోద్యద్దివ్యకాస!

నాలోన నీమహానాదరూపమునిల్పి
నాద ముపాసింతు మేదురముగ
పరమ పురుష! నీదు బ్రహ్మతత్త్వమ్మును
నాత్మరూప సరణి నరయ నెంతు
నాత్మబ్రహ్మమనెడి యనుభూతి నాకిచ్చి
పాండురంగ! యిమ్ము పరమ పదము 87

మును భక్తు లెందఱొ నిను నన్నుతించి యే
ముక్తి బొందిరి కాదె భక్త వరద!
జయదేవు డలనాడు జయజయ స్తుతులతో
నిన్ను గీర్తించి సాన్నిధ్యమొందె
అల తుకారాముండు నలఘుభక్తి ప్రప
త్తుల నాదు సాయుజ్యకలన నలరె
పరమ సాధ్వులు జనాబాయి మొదలగు ము
గ్ధలు కీర్తనలు సేసి కనిరి నిన్ను;
పండరీపురమ్ము భవదీయ దివ్యవా
సమ్ము సర్వలోక జనని నీదు
సాధ్వి ప్రక్కవెలయ సంరక్షకుడవౌదు;
పాండురంగ! యిమ్ము పరమ పదము. 88

మహిషమ్ముచే వేదమంత్రముల్ పలికించి
మహిలోన దన దివ్యమహిమ చాటి
నట్టి పుణ్యపురుషుడా జ్ఞానదేవుడు
నిను గొల్చియే కదా ఘనత చెందె!
పాదుషా చూపిన ప్రాణమ్ము లేనట్టి
పశుకళేబరములో బ్రాణవాయు
వును బోసి బ్రతికించు కొనిన యానామదే
వుండును నీదు భక్తుండుగాదె?
నిను భజించి మున్ను నీవల్ల నెనలేని
మహిమ జూపినట్టి మనుజ వరుల
గాథలెన్నో కలవు; కరుణతో ననుగా చి
పాండురంగ! యిమ్ము పరమ పదము. 89

ఏనాటి కథలొ నే దేల? యీనాడు వి
శాఖ పురాంచిత సాగరాం చ
లమునందు సుశ్లోక కమనీయ మూర్తులై
నీవు రుక్మిణియును నీవిశాఖ
పురవాసులను గావబూని భారత శత్రు
దళము లంబుధి పయస్సులను 'ఘాజి'
యను జలాంతర్గామి గొనితెచ్చి యీపుర
నాశమ్ము కొఱకు యత్నమ్ము చేయ
శక్తిమంతుడవు విశాఖ జనుల గావ
పగఱజతనములను బాడొనర్చి
కావ లేది నీవు కరుణమయా! దేవ!
పాండురంగ! యిమ్ము పరమ పదము. 90

అఖిలేశ్వరా? భిన్నమైన రూపములతో
వెలిసితివీ మహీస్థలిని కలియు
గమ్మున నీభక్త గుణముల బ్రోచుచు
ముక్తి నొసగెడు బుద్ధితోడ;
పండరీపురమున భవ్య మంగళ విగ్ర
హమ్ముగా వెలిసితివయ్య! పుణ్య
తిరుమల తిరుపతినీ వరవేంకటేశ్వర
రూపాన బ్రత్యక్ష రూఢి బరగు
దీవుః పూరినున్న దేవాలయమ్మున
నతుల మహిమ జూపునట్టి దివ్య
కళల నిల్చితివి జగన్నాధు డను పేర,
పాండురంగ! యిమ్ము పరమ పదము. 91

మహిత భక్తుల కీవు మందారమువుః యోగి
సముదయ కల్పకద్రుమము నీవు;
కువలయమ్మున నీవు కొంగు బంగారంబ
పై భక్తజనముల యార్తి బాపు
సర్వేశ్వరుండవు; సకల సమ్మని పుర
స్క్రియలకలరు వేల్పు గిడ్డివీవు;

సంసార దుఃఖంబు సడలంప వేడెదు
సజ్జనులకు బారిజ తమీవు;
భక్తవరులు నదు భవ్యనామము మది
సంస్మరింప నీవు సాయపడెదు;
భక్త సులభు డవగు భగవంతుడవు గావె
పాండురంగ! యిమ్ము పరమ పదము. 92

## రుక్మిణీబాయి స్తుతి

రంగమ్మ రుక్మిణీ! రావమ్మ పూజింతు
రంగు రంగుల పూలరాశి యిదిగో;
పాలు పండ్లిచ్చెద బంగారు తల్లివే!
పండరీబాయి! యోభాగ్యలక్ష్మి!
అనిశంబు నీదు సహస్ర నామార్చన
సాగించి నీదు పూజల నొనర్తు;
అమ్మలందఱ గన్న యమ్మవు నీవని
యాశ్రయించెద నిన్ భవార్తి తొలగ
లోకమాతవంచు బ్రాకటగతి నీదు
భజన లాచరింతు భక్తితోడ;
ముక్తికాంతవీవె మోక్షమ్ము నీయవే!
పాండురంగ! హృదయ భవ్యలక్ష్మి! 93

సర్వాంగ సుందరి! సర్వలోక జననీ!
వైకుంఠవాసివి! పద్మనేత్ర!
సచ్చిదానందంబు సర్వదా నాకిమ్ము
సర్వకళామయి! సంస్తుతింతు,
మాతృదేవతవంచు మదిలోన నీనామ
మదువు గ్రోలెద; నన్ను మఱవకమ్ము!
జననిరో నాకింక జన్మంబు వలదమ్మ!
సంసార బంధంబు సడల జేయు;

విశ్వజనని! నాదు వెతలన్ని పాపు మా
బ్రతుకు సంద్రమునను బడినజీవి
నేడిపింప దగునె? యీశ్వరీ! జగదంబ!
పాండురంగ! హృదయ భవ్యలక్ష్మి! 94

చెదుబుద్ధి నాలోన జిందుత్రోక్కకమున్నె
పోషశాక్షరి దెల్పితోదుగా వె;
పాపపుణ్యంబుల ఫలితంబు లెఱుగని
పరమ మందుడ నాకు బ్రాపునీవె;
దేహాత్మ భేదంబు తెలియని మూఢుండ
దివ్యత్వ వెఱిగెడు తెఅగు చెవుమ,
ఆత్మ నెఱు గలేని యజ్ఞాన మణపుమా,
అమృత మొసగి నన్ను నభవు జేయు:
వేదమాత! నిన్ను వేదవేద్యు డెఱుంగు;
అజ్ఞు దనగు నేంతమయిన
నీయపూ్వ శోభ నెఱి జూడ గలనమ్మ?
పాండురంగ హృదయ భవ్యలక్ష్మి! 95

వేదమాతా! నాకు విజ్ఞాన మొసగుము
యోగమాతా! నాకు యోగమిమ్ము;
ముక్తిమాతా! నాకు ముక్తి బ్రసాదింపు
నాదస్వరూపిణి నాదమిమ్ము!
శబ్దార్థమయి! నాకు శబ్దార్థముల దెల్పు
ప్రకృతిమాతా! నీదు ప్రకృతి జూపు;
జ్ఞానరూపిణి! నాకు జ్ఞాన మొసంగుము
శ్రీమతా! వెదచల్లు సిరుల జల్లు;
పృథ్వి పైని నాదు వెతలన్ని హరియించి
శాంతి గూర్పుమమ్మ శాంతి మాత!
లోకములకు నీవె యేకైక మాతవు;
పాండురంగ హృదయ భవ్యలక్ష్మి! 96

షోడశ చిత్కళా శుభ్రాంశు సముపేత!
సూర్యచంద్రాతప శోభితాంగి!
కనక కేయూరాది కమనీయ భూషణ
రత్నమయూఖ విరాజితాంగి!
బంగరు వన్నియు పట్టు పుట్టంబుల
మిహి మరీచులతోడ మెఱకయుతల్లి!
అమృతాంశు సమమైన యాస్యమ్ముతో నొప్పు
మంగళరూపిణి! మహితవాణి!
యంత్ర తంత్ర మంత్ర యాగేశ్వరీ! దేవీ!
సర్వదేవ వనుజశక్తి నీవె!
సర్వభూతమయి విశాశ్వత సుమిమ్ము;
పాండురంగ హృదయ భవ్యలక్షి! 97

సచరారంబుల సర్వశక్తియు నీవె;
సర్వజీవుల కీవె శక్తి నిత్తు;
నీవు లేకున్న నీనిఖిల సృష్టి నశించు
చైతన్యహీన నిస్సారమగుచు;
స్రష్టకు సృజియించు శక్తి నిత్తువు; సృష్టి
పోషణార్థము విష్ణుమూర్తి కీవె
శక్తి; నిచ్చెద వీవె శంకరునకు సృష్టి
సమయింప జేసెదు శక్తి నిత్తు;
బ్రహ్మ విష్ణురుద్ర భార్యలుగా నీవె
పరగచుందు మూడు సరణులూని;
త్రిగుణ తత్త్వములను ద్రిజగత్తులును నీవె;
పాండురంగ హృదయభవ్యలక్ష్మి! 98

ఆది పరాశక్తి వఖిల వేదగమ
నతవంచు నిన్ను సంస్తుతి నొనర్తు;
హరిహరాదులె నిన్ను నారాధనము జేసి
రన గ నరుండ నేనరయ నెంత?
అర్చనల్చేసి నిన్నానందపఱుప నా
వశమౌనె? రుక్మిణీ భవ్యమాత!

అణువు మొదలుగ విశ్వాంతరంబును నావ
రించిన పరమేశ్వరీ! నమోస్తు;
అంతరంగమందు ననిశంబు నీనామ
మంత్రమును జపింతు; మాకీన
సర్వరక్షణమ్ము సమకూర్పవే తల్లి!
పాండురంగ హృదయ భవ్యలక్ష్మి! 99

భావనాతీతవు భావనా గమ్యపు
భావింప గలన నిన్ పరమజడు డ;
బ్రహాండ భాండాన బ్రహ్మశక్తిని నింపి
బహురూపముల దాల్చు పరమశక్తి!
ప్రాణికోటిని గాచు బ్రహ్మతేజము నీవె;
ప్రాణమౌదువు నీవె; త్రాణమీవె;
అఖిలాంశలను నీవె యవతరింతువు భవి
సకల భక్తులు నీకు జాగి మ్రొక్కు;
నర్చనలును సలుప నానంద మొందుచు
నన్ని వరము లిత్తువమ్మ మాకు;
విశ్వమాతవీవు విశ్వేశ్వరీ! దేవీ!
పాండురంగ హృదయ భవ్యలక్ష్మి! 100

సర్వజ్ఞ! విఠలేశ సాగర ఈతారన
సతితోడ వెలసితి శాంతినగ;
సర్వశత్రువులను సంహార మొనరించు
శక్తినిచ్చి విశాఖ సైనికులకు;
భూనభోజల మార్గముల బోవు శాత్రవ
ధళముల హతమార్చు స్థైర్య మిమ్ము;
యంత్రశాల లిచట నవరియున్నవీవె
శాంతి భద్రత లిమ్ము సంతతమును;
ఈ విశాఖ జనుల కిమ్ము సుజ్ఞానమ్ము;
నెల్లవెళల నిను నెదను దలచి
నిన్ను గాంచునట్టి నేర్పు నొసంగుచు
పాండురంగ! యిమ్ము పరమ పదము. 101

పాండురంగా! నీదు పరమతత్వ మెఱింగి
సన్నుతింపగలేరు సకల మునులు
నరుడ నజ్ఞానుండ నన్ను నీశతకమ్ము
రచియింప నీవె ప్రేరణ మొనర్చి
నాడవు లోకేశ నా శక్తి కొలది నీ
నిస్తుల మహిమలు నిష్ఠతోడ
శతకరూపమున బ్రస్తావించితిని సత్య
నారాయణాఖ్యుండ నన్ను గావు
"సాయి"। "రామ" "కృష్ణ" శతకమ్ములను మున్ను
వ్రాసియుంటి దేవ! భక్తి మీఱ
నేడు నిన్ను గూర్చి నేరచించితి గృతిన్
పాండురంగ! యిమ్ము పరమ పదము 102

## ఫలశ్రుతి

పాండురంగ! విఠల! పావనమగు నీదు
శతకమ్ము జదివెడు సకల భక్త
వరులకు గామలోభమ్ముల క్లేశమ్ము
లుడుగును; సంసార జడధినుండి
తరియింప జేసెడు తత్త్వవిజ్ఞానవై
రాగ్యముల్ కలుగును; ప్రాక్తనంపు
గర్మముల్ బంధింప గా జాల; వైహికా
ముష్మిక సుఖములు పొసగు; మఱియు
నీదు భజనములను నిందు భక్తిని సల్ప
పరమ శాంతి కల్గు; పరగుముక్తి;
మోక్షదాత! నీ కటాక్షమ్ము ప్రసరించి
పాండురంగ! యిమ్ము పరమ పదము. 103

శ్రీ పాండురంగార్పణమస్తు
సంపూర్ణము.

==========xxxxxxxxxxxxxx============

## శ్రీరామ శతకము

రామ రామ యనెడి రసమయాక్షరముల
కైతకొమ్మ యందు కంఠమెత్తి
పా హృద్య మయ్యె వాల్మీకి కోకిల
రఘుకులాబ్ధిసోమ! రామచంద్ర! 1

దివ్యదృష్టి తోడ దీపించు వాల్మీకి
నారదముని చెప్ప, నలినభవుడు
ననుమతింప, నెఱపె నాదికావ్యరచన
రఘుకులాబ్ధిసోమ! రామచంద్ర 2

ఆదివిష్ణురూప యవతరించుచునుంద
వనని జనుల గావనార్తి బాపి,
దర్మరక్షకుడవు తాపసమందార!
రఘుకలాబ్ధిసోమ! రామచంద్ర! 3

విశ్వభాష లందు వెలసె నీ చైతన్య
మఖిలపూజ్య! నీ మహత్త్వ గాథ
వర్ణనాత్మకముగా వాల్మీకి రచియించె
రఘుకలాబ్ధిసోమ! రామచంద్ర 4

రామ! నీదు చరిత రమ్యమౌ సుధ గాన
భవ్యభక్త తతికి బంచి పెట్ట
బూనె నాది కనవి – తపోనిధి – వాల్మీకి
రఘుకలాబ్ధిసోమ! రామచంద్ర! 5

రామ! నీదు లీ రామాయణ మనంగ
రసము లొలుకు కావ్యరత్నకల్ప
కమును సృష్టి చేసె గవితల్లజుడు తొల్లి
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 6

జానకీ ముఖాంబుజ ప్రభాకర! దేవ!
పరద్మనేత్ర! దైత్యవంశదమన!
దశరథసుత! రామ! ధర్మరక్షక! హరీ!
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 7

నీలమేఘ వర్ణ! నిను గాంచ దరమౌనె
నిను నుతింపనెట్లు నేర్తు నయ్యా!
కనుల నీదు కాంతి గన శక్యమా? దేవ!
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 8

కడుపు పండె నంట కౌసల్య కలనా దు
దశరథుండు క్రతువు తనర జేయ
తండ్రిమట యన్న దల దాల్చితివి నీవు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 9

ఆదివిష్ణుదేవ! యారాధ్యమాను డ
వన్ని యుగములయందు నందఱకును;
ఆదిలక్ష్మి సీత యర్ధాంగి నీ కయె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 10

జతపడంగ శంకచక్రముల్ తమ్ములై
అవని పైని శేషు దనుజు డగుచు
శేషశాయి వయిన శ్రీశ నిన్ సేవించె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 11

దేవరక్షణంబు దివ్యంబుగా జేయ
దివిజు లెల్ల గోర భువిని వెలసి
దేహధారి వైతి త్రేతాయుగంబున
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 12

దివిజులరయ భువిని బ్రవిమల భక్తితో
కపి వితానముగ బ్రకాశ మొంది
నిన్ను గొల్చి రయ్యనీ కండగా నిల్చి
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 13

ఆదిలక్ష్మి సీత, హరి వీవె కద రామ?
అవని యందు మీర లవలతరించి
యిడుమ లొంది రవని యిడుమల బాపగా
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 14

రామనామ మెల్ల నామంబులను మించి
యతిశయించు గాదె యమృతముగను
దివిజులకును రామదివ్యరామమె రక్ష
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 15

కౌశికు కడ నెల్ల కారుమక విద్యల
గఱచి యజ్ఞకర్మ గాచి తీవు
శివధనుస్సు విఱిచి సీతను గైకొంటి
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 16

జనకు నాజ్ఞచేత వనమున కరిగితి
సీత లక్ష్మణుడును జేరి కొల్వ
భక్తవానరాళి వరుసగా గొల్వగా
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 17

నరుడుగా నటింప నారాయణా! నీదు
మహిమ నెఱింగినారె మందరిపులు
హనుమదాది కపులు కనిరి నీ దివ్యాంశ
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 18

భాస్కరాంశ వలన బ్రభవించె సుగ్రీవు
డవని బుట్టె వాలి యమరవిభుని
యంశముననె నీదు హరిలీల దీపింప
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 19

సురలు వానరు లయి క్షోణీస్థలిని నిన్ను
జేరి పేర్మి గొలవు చేయుచుండ
ధర్మరక్షణంబు తగ నొనిర్చితి వయ్య
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 20

సీత వెదకి తెత్తు సేమంబుగా నని
రవితనూజు డెలమి ప్రతిన సేయ
వాలి జంపి వాని బ్రభువుగా జేసితి
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 21

ఆది విష్ణువు నిను నా విభీషనుడెల్ల
వేళల నెద నిల్పి ప్రీతి గొల్చి
లంక నేలెనీకు లెంకయై యాతడు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 22

పరమ భక్తి నిన్ను భరత శత్రుఘ్నులు
భ్రాత గొల్చి పుణ్యవంతులైరి
రామరాజ్య మనిరి ప్రజలు నీ యేల్బడి
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 23

పుణ్యబుద్ధితోడ బుణ్యకర్మము చేయ
పుణ్య పురుష మహిమ పొంద వచ్చు
పుణ్యనింద చేయ బోరు పొందక యున్నె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 24

పుణ్యభూమి యందు బుట్టిన పురుషుండు
పుణ్యనిధులు చేయ బొందు ఫలము
సజ్జనుండె కాంచు సాత్త్విక శక్తిని
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 25

దేహి యాత్మ యందు దివ్యాంశ లేనిచో
దివ్య పురుషమహిమ తెలియలేదు
గ్రంథములను జదివి కన డు దివ్యత్వంబు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 26

మలిన చిత్తుడు మతిమాలి నీ లీలల
మర్మమెఱు గ లేదు మహిమ గన డు
నింద చేయువాడు నిందింప బడు నిల
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 27

పాదు లేని తీగె ప్రాకెడు చందమ్ము
చెదురు నట్టి మనసు పదిలముగను
పరిఢవిల్ల జేయు ప్రాపు నీ నామమ్ము
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 28

క్రోధ మణ పలేను కోదండధర! రామ!
పాపకూపమందు బ్రతుకుచుంటి
నాదు తాప మణు ప నారాయణా! రావ
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 29

కామ మణపలేను కామదూరుడ! రామ!
మద మడంప లేను మాన్యరిత!
లోభ మణ పలేను లోకేశ కావవే
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 30

మో మణ ప లేను పురుషోత్తమా! రామ!
మత్సరము నడంప మఱియు నాకు
చేత కాదు శ్రీశ! శీఘ్రమే కావవే
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 31

రామ! నన్ను గావ రావయ్య వేగమే
సీత తోడ రమ్ము శ్రేయ మొదవ,
ఆంజనేయ! వరద! యతివేగముగ రమ్ము
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 33

ఏమి చేయుచుంటి? వెనుంటి? వో రామ!
ఎట్లు విడుతు నిన్ను నేమొనర్తు?
నెదనె నిల్పితి నిను నెటు పోదు వింకను
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 34

ఫీదు జపము చేసి నేనేమి కాంక్షింతు?
నీదు కరుణ గాక నీవలర్ణ!
నీ కటాక్షము కయినే గార్తు నశ్రువుల్
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 35

నామ జము తప్ప నాల్క వేఱాడదు
మనసు కూడా నిన్నె స్మరణ చేయు,
త్వన్మయంబు తనువు త్వన్నామజపముచే
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 36

కనులు కాంచ గోరు కౌసల్యసుత! నిన్ను
వీనులలర నిన్ను వినగ గోరు
కరయుగమ్ము నిన్ను వినగ గోరు
కరయుగమ్ము నిన్ను కైసేయగా గోరు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 37

నిన్ను జూడకుండ నిముసంబు మన జాల
నన్ను విడువవలదు కన్నతండ్రి!
నీవు నేనె మఱియు నేను నీవె యగుదు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 38

ఆత్మరాముడంచం నానంద మొందుచు
ఆత్మరూప! నిన్నె యాత్మ గొల్వ
ఆత్మరాముల యెడ నంతరం బెటులుండు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 39

దివ్యచక్షు వొసగు దివ్యాత్మ! శ్రీరామ!
దివ్యమైన నీదు తేజము గన
దివ్యచిత్త మొసగి దేవ! నన్నాగవుమా
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 40

మనసు పరిమళించు మమత నిన్ను దలంచి
కనుల వేడ్క నిన్ను గాంచినంత
అరయ నీదు నామమమృతమే యగు గాక
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 41

రామమంత్ర మహిమ రాగి విరాగియౌ;
భోగియోగి యౌను; మోక్ష మొసగు
రామజపమనంగా స్వామి! తథ్యము కాదె?
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 42

'రామకోటి వ్రాసి రామజము చేసి
ముక్తి బడసి' రనుచు భక్తి వఱల
ఆర్యులన్నమాట సార్థక మగు గాదె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 43

రామమంత్ర జపము రక్షించు భక్తుని
భూతలమున; భుక్తి ముక్తి నిచ్చు
మంత్రమున్న రామమంత్రంబె యనదగు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 44

ఏ కులంబునందు నెక్కడ బుట్టిన
సత్యధర్మనిష్ట సడల కుండ
నీదు మంత్ర జపము నెమ్మి సల్పందగు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 45

అంత రామమయమె యందురు యోగులు
రాము గొలవుకున్న రాదు ముక్తి
రాము డిచ్చుచుండు రాగభోము లిల
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 46

రామ మంత్రజపము రామయంత్రార్చన
రామ భజన చేయు, రాదు కీడు;
భక్తులందు రామభక్తుఏ శ్రేష్ఠులు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 47

కలుగ నేమి ఫలము ఘనవిద్య లెల్లను
రామజపము నోట రాకయున్న;
సీత దలప కున్న సిరియెట్లు సిద్ధించు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 48

కలియుగమున బెక్కు గలవు దేవళములు,
కలవు తీర్థ చయము లిలను చాల;
ఇన్ని యేల? నేవె యిత్తువు ముక్తిని
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 49

బ్రహ్మతత్త్వమునకు బరు డు జీవు డు కాడు
జీవు డెఱుక చెంది దేవుడౌను
దేవు జూచినట్టి జీవుడు దేవు డే
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 50

దేవు నెఱు గునట్టి జీవియే జ్ఞానియౌ
ఎఱుక లేక జ్ఞాన హీను డగును;
దేవు నెఱుగు వాడె దేవుడౌ దీప్తితో
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 51

ప్రభుడ వీవె భక్త వరులకు నిచ్చెద
విహపరోజ్జ్వలముగ నెస గు దృష్టి;
ఎఱుక యున్నవాడె యెఱుగు బ్రహ్మంబును
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 52

భక్తిహీనులైన ప్రజ లెన్ని మాఱులు
తరిచి రేని నీదు ధన్యగాథ
తెలియ వశమె నీదు నీదు దివ్యహత్యమ్ము
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 53

స్వామి నీ చరిత్ర సామాన్యముగ నెంచు
వాడు మూఢు డగును వసుధ యందు
నీ మహత్వ మెఱుగ నేర్చునే యజ్ఞాని
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 54

చెడ్డ మనసుతోడ జేయు కార్యంబులు
చెడ్డవాని కొసగు చెడు ఫలములు;
చెడ్డ తనము వీడ జేయు నీదు జపంబు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 55

చెడు తలంపు వాడు చెఱచు సమస్తంబు
చెడుగు వలన మంచి చేయ గలడె?
నీదు భక్తి చేరనీదు చెడుగు నెప్డు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 56

చెడ్డ రక్కసుండు సీత నపహరించి
చెడెను; చెడ్డతలపు చేటు కూర్చ
జెడెను దైత్యకులము చేరి వానిని గొల్వ;
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 57

తెలియలేక నిన్ను దితిజాధిపతియును
శక్తి కలిగి కూడా సమసి పోయె;
నిన్ను నెఱుగ గలుగునే కీడు వానికి?
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 58

'పరుని యింట నున్న భార్యను దెచ్చెను
అధిపుడ'ంచు లోకు లాడినంత
సతిని విడిచి తీవ్ర జననాథ! దర్మజ్ఞ!
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 59

కామికన్న మోక్షకామియే మిన్న యౌ
గామి కెపుడు కల్గు గష్టచయము
కామి కెవ్వ డిచ్చు గౌరవం బవనిలో
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 60

భక్తులైన నేమి ఫలము రాక్షసవృత్తి
వలన చిత్తశాంతి తొలగిపోవు
రాక్షసత్వ ముడుగ ప్రార్థింపవలె నిన్ను
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 61

రామలందు మనసు రంజిల్లు మనుజులు
రాము నిన్ను గనరు రాగు లౌట;
రామలందు నిన్ను రహి గాంత్రు భక్తులు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 62

రామ యిచ్చు రక్తికామమోహంబుల,
మోహమడ చి యిడుదు ముక్తి నీవు
నీ పదముల భక్తి నిలుపుట మేలౌను
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 63

రావణుండ భువిని రాజిల్లకుండనే
భూమిజ యెడ మోహబుద్ధి గొనక
కామ మణచుకొన్న కాడె బ్రహ్మ యతండు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 64

ఎంత తపము చేసి యేవరాలను గొన్న
ఒక గుణము లేక యుక్కడంగె
దైత్యవిభుడు భక్తి తగులక నీయందు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 65

రావణుండు నా డు రాజ్యదూరుడు కాడె
ముజ్జగంబులందు గొగడ బడియు
బరుని దార గోరి ప్రాణము లర్పించె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 66

సర్వవేదశాస్త్ర సారంబు దెలిసియు
సర్వదేవతలను నావ నణచి
రావణుండు మడిసె దేవ! నీ చేతనే
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 67

సీత నపహరించి చిత్తనాశము పొంది
గుణము లేక కులము గోడుచెంద
రావణుండు చచ్చె రాక్షస కులముతో
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 68

తలలు పదియు జేతు లొలయ నిఋవదియు
రావణుండు చచ్చె రణము నందు
పాప బుద్ధియున్న బలము జయించునే?
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 69

చెల గి రావణుండు శ్రీకంఠభక్తుండు
త్రిప్పి బొమ్మలుగను దికృతులను
దిక్కులేక చచ్చె దేవహింసకు డౌట
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 70

అన్న వోలె గాక యావిభీషణ దైత్యు
డన్ని మంచి గుణములున్న కతన
నన్న హితుడు కాగ నధివసించెను గద్దె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 71

దేవ వంశ మెల్ల జీవించి యుండగా
రాదటంచు దొలి వరమ్ముగోర
దల చి కుంభకర్ణదనుజు డడిగె నిద్ర
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 72

కుటిలుడౌట గాదె కుంభకర్ణుండును
నలువ గోరి వరము నాశమందె
తపము వలన గీడు తామసుల్ కోరరే
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 73

బోగయోగమేల భువి నశించును గాన
యోగ మన్న నీదు మోగ మొకటె
కామభోగములను కష్టంబులే యిచ్చు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 74

అన్యభామలందు నవనితనూజనే
చూడ గలరు బుధులు సృజనులగుట
పర పురుషుల శీలవతులు కాంతురు నిన్నె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 75

చిత్తశాంతి నొసగు సీతామహాలక్ష్మి
జీవు నదువులోన జిత్తముంచు
సీత బక్తులకును జేకూర్చు మేలునే
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 76

తొల్లి వాయు సూనుతో కకు జిచ్చిడ
దైత్యగణము, సీత దయ దలిర్ప
శీతలముగ నగ్గి సేసి దూతను గాచె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 77

సీత యన్న మనకు శీల సంపద యబ్బు
సీత యుగయుగాల శీలమునకు
మారు పేరు గాదె మనుజలోకంబున
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 78

పతిని గలియ దల చి పడె గష్టములీ్వత
పతియె దైవమిలను భార్యకెపుడు
పతుల గొల్చు సతులు పరమ సాధ్వులుగారె!
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 79

సీత కండ యయ్యె శీలంబు లంకలో
అసుర విభుండు తనకు నాశలెన్నో
చూ ప దొడ గి మనసు చూరాడ దలకొన్న,
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 80

జనకుని సుతమయ్యు జగతిలో సీతమ్మ
చిక్కె ముక్తి కంఠచేత, డేగ
వాత బడిన సాధుపారావతము వోలె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 81

దగ్ధమయ్యె లంక దనుజరాజానాడు
సీత మానసమున జిచ్చు పెట్ట
సీత శీల మొకటె సీతను గాపాడె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 82

శీల మొకటి చాలు సీతకు రావణు
దగ్ధము నొనర్ప; దనుజు డైన
అరిని నీవ చంపె నామె విడిచె గాదె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 83

రామ! నీదు బంటు రాజితచరితుండు
వాయుసూనుడరయ భక్తవర్యు
డగుచు నీదు సేవ నాచరింప గడంగె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర 84

వాయునందనుండు బ్రహ్మ కాబోవును
బ్రహ్మచారి కొన బ్రహ్మ మెఱుగు
మరల సృష్టి దొడర మారుతి బ్రహ్మయౌ
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 85

భవభయంబు భూతభయమును భువిపైని
హనుమడణ చుచుండు నతని గొల్వ;
ఆంజనేయు డుండు నన్ని యుగంబుల
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 86

నీ మనోజ్ఞ కథల నిష్ఠతో నెరపరే
గద్యపద్య కావ్య గానములను,
దృశ్యరూపములను ప్రీతి రచింపరే
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 87

శ్రవ్యదృశ్య కావ్య సరణుల దావక
గాథవిన్న గన్న గలుగు రక్తి
ముక్తి కలియుగాన భక్తకోటికి సదా
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 88

రామ మందిరములు రామనామశ్రుతుల్
రామమంత్రజపము ప్రబలు నెచట
అచట గల్గు చుండు నానందశాంతులు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 89

బహుళగతులు జనులు వసుధపై జీవింత్రు;
ఫలము గలదె నిన్ను గొలువ కున్న?
మానువలకు రక్ష సీనామ మొక్కటే
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 90

రామకథను మించి రమ్యగాథయె లేదు
రాముదంతవాడు భూమిపైని
పుట్ట లేదు మరియు పుట్టబోడిక పైని
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 91

రామదాసు మున్ను భూమిజకును నీకు
భక్తి తోడ నిచ్చి ప్రభుధనంబు
బంధితుగ నవియ బాలించితివి నీవె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 92

తప్పులెన్నో చేసి తప తప్పులను గావ
కుటిల బుద్ధి నిన్ను గొల్పు కపట
భక్తి గొందఅట్టి భక్తులు భక్తులే
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 93

నిర్మల హృది నిన్ను నిచ్చలు గొల్చిన
నిత్తు నీవె శాంతి హెచ్చు గాను
ఈయ గలవు సుఖము నెట్టి సంపదనైన
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 94

రామమందిరముల నీమూర్తి పూజించి
నంతమాత్ర ధన్యుడగునె నరుడు
ఆత్మశుద్ధి నిన్ను నాత్మ గనిన గాక
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 95

వేఱుకారు నీకు పేదలు రాజులు
భక్తి నిను గొలువని ప్రభువు ప్రభువె?
పేదవాని నైన బ్రేమించెదవు నీవు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 96

మోదమలర జేసి మునిజనాదుల బ్రోచి
క్రూర రాక్షసులను కూల ద్రోసి
అవని గావ నీవ యవతరించిత పృథ్వి
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 97

పట్టమొంది నీవు భద్రసింహాసన
మందు సీత గూడి యలర నీవు
కపులు సోదరులును గలిసి సేవింపరే
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 98

వానరముల నెల్ల బహుమానము లొసంగి
పంపివైచితీవు పట్టభద్ర!
హనుమడొకడె తావకాంఘ్రుల గొల్చెను
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 99

రాక్షసులకు దొడ్డ రాజుగా నావిభీ
షణుని బంప నతడు సంతసించి
అధిక భక్తియుక్తుడై నిన్ను సేవించె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 100

ధర్మపాలనమున దర నేలితివి నీవు
రాజులందు మేటి రాజ నీవు
రామరాజ్యమనెడు రమ్యోక్తి ధరనిల్చె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర 101

లవకుశులనునట్టి లక్షణోపేతులు
నిన్ను మించు ఘనులు నీదు సుతులు
వారి వలన గాదె వంశంబు వర్ధిల్లె
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 102

రామ లీల మాద గ్రామసీమ జెలంగ
పాలుగొంచు రామలీలయందు
రామశతక మపుడె వ్రాసితి నీపేర
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 103

రామమహిమ గూర్చి రచియించినట్టి యీ
శతక మెవ్వరేని శ్రద్ధ తోడ
చదివిన వినిన సిరి సంపదల్ సమకూరు
రఘుకులాబ్ధి సోమ! రామచంద్ర! 104

ఓం తత్సత్

సంపూర్ణము

# శ్రీ కృష్ణ శతకము

-1-

దేవకీ తనూజ! దీనబాంధవ! శౌరి!
వాసుదేవ కృష్ణ! భవ విదూర!
విష్ణురూప! శ్రీశ! వేదాంత గోచర!
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 1

విశ్వభరిత! సకల విశ్వకళ్యాణంబు
నెరప దలచి ధర్మనిరతి బూని
భువిని బుట్టినట్టి పురుషోత్తము డ వీవె
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 2

ఆదివిష్ణుమూర్తి! యవతరించెను భువిన్
దుష్టశిక్షణమ్ము శిష్టరక్ష
ణమ్ము వెలయగా జగమ్ము బ్రోచెద వీవు
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 3

ఎచట బుట్టు దువని యేమిచేయుదవుని
ఎఱుగ లేరు సురలె యెఱుక గలిగి
ఎటుల నెఱుగ నేర్తు రేణుక మాలిన నరుల్
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 4

ధర్మరక్షణమ్ము తావక ధర్మము
ధర్మ నిరతి గొన్న నిర్మలాత్ము
లైన సాధుజనుల నాదరింతువు గదా!
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 5

ఎంత తపము చేసె నెన్నడో దేవకి
నీకు దల్లియగుచు నెగడె భువిని
గోకులమ్ము నిన్ను గొలిచి పెంపారదే
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 6

ద్వాపరమున దివిజతండముల్ వీడగా
మనుజ రూపమొంది దనుజపాళి
నడచి యడరినట్టి యార్త సంరక్షకా!
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 7

వేదనాదరూప! విష్ణుదేవ! మహేశ!
విశ్వగర్భ! భక్తవితతి గావ
అవని మాతృగర్భమందుద్భవింపవే
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 8

గర్భ నరకబాధ కలిగెడి జీవుల
గర్భమందు గావ గల్గినట్టి
నీకు గూడనట్టినియతి తప్పగ లేదు
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 9

పాపకృతుల జేసి పడరె గర్భములందు
నరులు; పాపరహిత; నరుల బ్రోవ
పాప జనుల బోలి పడవె గర్భములో
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 10

యోగులెల్ల మరల యోని బుట్టకవాయ
వేడుకొనగ వారి వినతి నరసి
మానవుండయితి మహి మౌనులను గావ
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 11

యోగియైనవాడు యోగమ్ముచే నుర్వి
యందు మరల జన్మమంద బోడు
అట్టివా డవయ్యునతరించితి భువిని
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 12

యోగ్యులైనవారు యోగంబు నెఱుగ గా
యోగభేదసరణి యుద్ధవిల్లె
యోగి చూడ గలడు యోగీశుడగు నిన్ను
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 13

అమరులెల్ల నా డు యాదవులై పుట్ట
హరివి నీవు భూమినవతరించి
తారలందు శశిగ దనరి రాజిల్లవే
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 14

దుష్టుడైన కంసు దునుమ గా నాతని
యనుజకున్ సుతుండ వైతి వీవు
గోపికలను గావ గోపాలు డవు కావె
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 15

చెఱను బెట్టె దనదు చెల్లెలిన్ బావను
నీదు మేనమామ నీవు పుట్టి
నపుడె నిన్ను జంపనాశించి మూఢుడై
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 16

నిదు మహిమ వలన నీకు మాఱుగ యోగ
మాయశిశువు నీదు మామకంద
జేసి గొల్లపల్లె చేరి పెరి గితీవు
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 17

మాత యన్న భువిని మాత నిమాతయే
దేవదేవ నిన్ను దేవకి గని!
మాతృజాతి కెల్ల మకుటమై వెలయదే
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 18

యోగి గనుటె మంచి యోగంబు తల్లికి
యోగ్యురాలె గాంచు యోగి నిలను
నిన్ను గన్న యోగ మెన్నగా శక్యమా
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 19

లోకమాత గాదె లోకేశ! నీతల్లి
పుణ్యమెంతో చేసి పొందె నిన్ను
నిన్ను గన్న పుణ్యమెన్న సామాన్యమే
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 20

గర్భమందు నీవు కలుగ గా దేవకి
దేవియందు నలమె దీప్తమగుచు
నిన్ను గూడియున్న వీ దివ్యతేజస్సు
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 21

గర్భమందు నీవు గ్రాల నిన్ను నుతించి
రెల్ల దేవవరులు, తల్లియైన
దేవకి తనబిడ్డ దేవుడని యెఱుంగ
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 22

తల్లి కడుపునుండి ధర్మ పైని నీవుద్భ
వించినప్పుడు దివ్యవిష్ణుతేజ
మావరించె దిక్కులందు జోద్యంబుగా
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 23

దేవకి పతితోడ దివ్యశిశువు గాంచి
విష్ణువంచు పెక్కు విధము లొప్ప
నిన్ను మనసుదీర సన్నుతించెను గదా
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 24

"కేశవ! నిను జూడ భేదంబు తొలగెను
విష్ణురూప! జిష్ణురూప!" యంచు
నిన్ను బొగడిరయ్య నీ తల్లిదండ్రులు
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 25

"మాధవ! మము గావ మనుజ రూపముతోడ
మాకు హితము గూర్చి మహిని వెలసి
నాడ" వంచు నిన్ను వే డె నీజనకుండు
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 26

మరియు నిన్ను జూచి పరిపరివిధముల
నీదు నామములను చేర్పుతోడ
నుచ్చరించు చిట్టులుత్కంఠ వేడెను
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 27

“గోకులంబు గావ గోవింద! వచ్చితి
అచ్యుత పదమీవె యచ్చుతుండ!
శ్రీధర సిరులిచ్చి యీధాత్రిగావవే
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 28

కృష్ణ! నిన్ను జూడ విష్ణురూమోతో చు
పద్మనాభ! నిన్ను బడసి ధన్య
తము డనైతి నన్ను దరియింప జేయవే
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 29

నాకు ముక్తినిమ్ము నారాయణా! శౌరి
నారసింహ! చీల్చు నాదు రిపుల
తామసంబణ పుము దామోదరా! స్వామి
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 30

ఓపలే మిడుమల నోజనార్ధన! కృష్ణ!
ఉత్తమోత్తమ! హరి! ఓయుపేంద్ర!
విషయవాంఛ బాపు విష్ణూ! హృషికేశ
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 31

పుణ్యబుద్ధినొసగి పురుషోత్తమా! కావు
మాత్మనెఱుగ జెపుము హంసరూప!
దివ్యభవ్యమూర్తి! దేవ! త్రివిక్రమ!
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 32

అట్లు నిన్ను గూర్చి యావసుదేవుండు
ప్రస్తుతింప నీదు ప్రభవకాల
మందు నీదు తండ్రి కభయమిచ్చితి గాదె
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 33

బాహుబలయుతుండు బలరామ డారోహి
ణికి దనూజు దగుచునెగడెనాది
శేషనంశబుట్టి సేవించుటకు నిన్ను
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 34

అల యశోధ కొదవి యాయోగమాయ నీ
కొఱకు మాయమయ్యె కొడుకవగుచు
నామె యొడిని బెరిగి హావణిల్లితివి నీవు
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 35

కంసు జంపదల చి గాదె నందుని యింట
గోపబాలకు దన గోప్యముగను
పెరిగితీవు – హరివి – నరుడవై ధర్మపైని
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 36

కంసుడనుప నీదు కడకు పూతన వచ్చి
చన్నుగవను విషము సంతరించి
నీకు గుడుప బోయి నీచేత జచ్చెను
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 37

వెన్న పాలు పెరుగు వ్రేపల్లె యిండ్లలో
దొంగిలించితిని ననిన దొంగకృష్ణ!
ముద్దు లిడిరో నిన్ను మొత్తిరో గొల్లలు
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 38

మన్ను తింటివంచు మఱిమఱి నీయన్న
అమ్మతోడ జెప్ప నామెకపుడు
భువన సృష్టి నోటబొలుపార జూపవే?
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 39

పిల్లవాడ వైన బెద్దచేష్ట లొనర్చి
పెట్టి తీవు కలత పెఱల యిండ్ల
అమ్మ నమ్మదాయె నా గోపికల గోడు
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 40

గోప బాలకులను గోవత్సములతోడ
గానకుండ జేయ గమలభవు డు
వారి గాంచితీవు పలు తెఱంగుల నేచి
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 41

బాల్యమందె నిన్ను భయపెట్టి హింసింప
నసురు లేగుదెంచి హతులు కారె
కంసుహింసవలెల్ల గడతేర్ప బుట్టిన
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 42

కాళియఫణి నీట హాళి నణంచితి
గోపగోగణంబు గోదువాయ
దావవహ్ని మ్రింగి ప్రోవవే ప్రాణుల
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 43

అష్టసతుల బడసి యారాధనలు బొంది
భువిని దివిని బరమ పూజ్యుడ వయి
అంగనలను గూడు టదియెల్ల నీలీల
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 44

తేజమదర ఋషులు త్రేతాయుగంబున
రామచంద్రునెడల రక్తిజూప
గొల్లపడ తుల గుచు గొల్వరే నిను జేరి
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 45

ద్వాపరమున వారి వాంఛలు నెఱవేఱ
భామలగుచు నిన్ను వలచి క్రీడ
లందు దృష్టి గనరె బృందావనస్థలి
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 46

చిన్ననాట నీవు చిలిపిచేష్టలతోడ
గొల్లవెలదులకడ కులికియుంటి
వౌర! నీకు దగున యచ్చుతా! గోవింద!
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 47

మరులు గొన్న సరణి మగువల గూడితే?
రాగరహిత! వారి రక్తి కలరి
ముక్తి నీయ దల చి మనుకొంటివంతియే
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 48

వేణుగానమీవు వెలయింపగా నింద్ర
జాలముగ్ధలైన లీల, గొల్ల
వెల దు లెల్ల నిన్ను వెంటాడి కొల్వరే
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 49

నీదు వేణురవము నేర్పెట్టిదో కాని
గొల్ల పడుచులెల్ల కొసరి కొసరి
విరహబాధ నిన్ను వెదకరే వేసారి
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 50

గోచితోడ మునులు గుట్టుగా నాడుండ
కోకలుండవేల గోపికలకు
నేడు? కొంటెపనికి నీవేల పూనితి?
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 51

మానవతులు నదిని స్నానమ్ము సల్పగా
వసనములు హరించి వారిమనా
మెల చూఱ గొనిన నల్లనయ్యవు దేవ!
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 52

మానవీయ! నీవు మగువల చీరల
నపహరించి వారి యాత్మలందు
మానమనెడి మాట మరఫింప జేయవా?
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 53

మానహాని కలుగ బోని వితమ్మున
మానవర్మమరసి మగువలకును
తత్త్వబోధ సలిపి తరియింప జేయవే
భక్త వరద! కృష్ణ! ముక్తిదాత! 54

వనితలెన్న మున్ను మునులె; మానమ్ము మూ
ఢత్వమౌను; దానితత్త్వమెఱక
చేసి ప్రణయమునకు జేకూర్చితివి భక్తి
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 55

మగువలకును బ్రేమమార్గమొక్కటె చాలు
భక్తులగుచు వారు ముక్తినొంద;
అమలమైన ప్రేమ యనభక్తియే కద!
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 56

ప్రేమయన్న బ్రియులు ప్రీతి గూడుట కాదు
ప్రేమసారమెన్న బ్రియులయాత్మ
లేకమగుట – యట్టి యెఱుక జూపించితి
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 57

ఎన్నో భవనములెత్తి యెంతయో తపియించి
ఎఱుగలేక యేది యెఱుగవలెనో
ఎఱుగ దలచి మౌనెలెలమి బొందరె నిన్ను
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 58

ఏమి నీవు చెప్పనేమి చేసిరొ గొల్ల
పడ తు; లెఱుగ గలదె జడత నున్న
జగతి ప్రేమతత్త్వసారమ్ము సుంతైన
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 59

మనసు వశ్యమైన మనజుని యింద్రియ
మ్ములను గూడ వానికలవియగును
మనుజులందునున్న మనసు నీవే సుమీ!
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 60

ఇంద్రియమలు వలన నెసగు నజ్ఞానంబు
మనసు గప్పి వైచు మాయ సతము
మాయ ద్రోసిపుచ్చు మనుజుడే దేవుడు
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 61

మనసు మహిమ దెలియ మనుజులు నిను గొల్వ
మాధవ! దయచూపి మాయబావపు;
మనసు గట్టువారు మాధవ! నిన్గాంత్రు
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 62

కోర్కెలణ తువీవు గోవింద! నిన్గొల్వ
మాధవ! నినువే డ మమతలుడుగు;
మనసు వశమొనర్చు మంచి మార్గము చూపు
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 63

మనసు దివ్యమగును మంచినరున కెప్డు
మనుజునదుపునందు మనసెయుండ;
మనసు కట్టువాడె మాధవ! నీవా డు
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 64

అల కలిందజ కడ పులినస్థలమ్ముల
మురళి నూ ద నీవు పరవశత్వ
మంది మోరలెతి&త యాలమందలు నిల్చె
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 65

వేణుగానమీవు వెలయింప మధురమౌ
స్వరములెన్నొ వెల్లివిరిసె వలపు
తర గలగుచు గోపతరుణుల మా పుచు
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 66

వెదురుగొట్టమీవు పెదవిపై మోపుచు
గానమీమ సల్ప గా జగమ్మె
చలన రహితమగుచు స్తంభించి పోవదే
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత? 67

వేణుగాన లోల! వేదాంతవేద్యుడ !
గానరూప! నిన్ను జ్ఞానులైన
గానవాదవిదులు కనిరి నాదమ్ములో
భక్తవరద ! కృష్ణ! ముక్తిదాత! 68

గానమన్న సామగానమ్మ మఱియును
గానరీతులెల్ల గల్గెనందు
గానమభ్యసించి కనిరి బ్రహ్మము బుధుల్
భక్తవరద ! కృష్ణ ! ముక్తిదాత ! 69

గానదాదములకు గల యైక్యమును గూర్చి
వేదవిదులు తెలిసి విజ్ఞులైరి
గాననాదములును గలవు వేదంబుల
భక్తవరద ! కృష్ణ ! ముక్తిదాత ! 70

వేదమెల్ల నాదవిద్యయే యందురు
జ్ఞాను లెఱుగ గలరు నాదమహిమ
నాదమయు డవీవె నారాయణా ! హరీ !
భక్తవరద ! కృష్ణ ! ముక్తిదాత ! 71

నాదమభ్యసించు నరులకిత్తువు ముక్తి
ఆరయ నాదమీవె యగుటవలన
ప్రణవనాద సరణి బ్రహ్మతత్వమిత్తువు
భక్తవరద! కృష్ణ! ముక్తిదాత! 72

ప్రణవరూపుడైన భగవంతు డవు నీవు
ప్రణవముచ్చరింప భవము తొలగు
ప్రణవ మెఱుగువాడు బ్రహ్మత్వమును బొందు
భక్తవరద! కృష్ణ ! ముక్తిదాత? 73

ప్రణవముచ్చరించి ప్రణవ స్వరూప! నీ
ప్రణయమంది ద్వాపరమున మునులు
ప్రణయినులయి నిన్ను బడసి ముక్తి గనిరి
భక్తవరద ! కృష్ణ ! ముక్తిదాత ! 74

ప్రణవముచ్చరింప భవము పొందరు నరు,
లదియె వేదసారమనిరి బుధులు;
వేదమభ్యసించు విజ్ఞులే విబుధులు
భక్తవరద! కృష్ణ ! ముక్తిదాత ! 75

వెదురుకట్టె నూది మధుర నాముులు
వెలయజేసినట్టి వేదవేద్యస!
నాదుకట్టె నూ ది నాదమ్ము సింపవే
భక్తవరద ! కృష్ణ! ముక్తిదాత! 76

శబ్దమయముగాక సకల సాహిత్యంబు
శాస్త్రవిదులు నిన్ను శబ్దమయుడ
వంచు నుడివిరట్టి యాకారమును జూపు
భక్తవరద ! కృష్ణ ! ముక్తిదాత ! 77

గోపకాంత లెల్ల గోపాల ! నిన్జేరి
నీదు శబ్దగాన నిరతితోడ
నైక్యమెసందిరతులితానందమును జెంది
భక్తవరద ! కృష్ణ ! ముక్తిదాత ! 78

## III

ధర్మరక్షణంబు ధలణిపై నెఱవేఱ
కృష్ణుడనెడి పేరగీర్తినొంది
పాండవులకు మేలు వాటిల్లజేయవే
భక్తవరద ! కృష్ణ ! ముక్తిదాత ! 79

ధర్మపక్షమూను దైవమా ! నీవల్ల
పాండునందనులు ప్రభావితులయి
నీదు రక్షణమున నెగ్గిరాహవమున
భక్తవరద! కృష్ణ ! ముక్తిదాత ! 80

పంచపాండవులకు బత్నియై ద్రౌపది
ఇడుమలొందినప్పుడీవె కాదె
ఎల్లవేళలందు జల్ల గా జూచితి
భక్తవరద ! కృష్ణ ! ముక్తిదాత ! 81

కౌరవులను నీవకద రూపుమాపితి!
కృష్ణ! నీవె కదనకేళినడపి
దుష్టశిక్షణమ్ముతో నిర్విగాచితి
భక్తవరద ! కృష్ణ ! ముక్తిదాత ! 82

ధార్త రాష్ట్రులార్యధర్మంబు విడనాడి
తోయజాక్ష ! త్రాళ్లతోడ నిన్ను
బందిచేయ గడ గి పొందిరి నాశంబు
భక్తవరద ! కృష్ణ ! ముక్తిదాత ! 83

మనుజ బలము నమ్మి యనిని దుర్యోధనుం
డణ గె; నిన్ను నమ్మినట్టి పాండు
సుతులు విజయమొంది సుఖులైరి నీకృపన్
భక్తవరద ! కృష్ణ ! ముక్తిదాత ! 84

నీవు లేని బలము నిల్వదు భువిలోన
హాని దలచువారు హతులు గారె
దైవబలము ముందు తమ బల్మి నెగ్గనే
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 85

జ్ఞాతులందు మైత్రి సాధించుటకు భీష్మ
విదురుల మృదువాగ్గభీర సరణి
చెవిని పెట్టకుండ జెడిరి కౌరవులెల్ల
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 86

దుష్టచేష్టలెప్పుడు దోషినే హతమారుచ
కష్టపడినవాడె కడకు గెలుచు
నష్ట పెట్టువాడె నాశనంబునందును
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 87

సంపద కలవాడు శక్తివంతుడును
శాంతిదూరుడైన సర్వనాశ
మెందు; రాజరాజు ద్రుంద డే పోరిలో
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 88

పాండు సుతుల ధర్మపక్షమ్ము విడనాడి
గ్రుడ్డిరాజు తుదకు గోడుచెందె;
పరుల హింసపెట్టి పాడైరి కౌరవుల్
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 89

దైవశక్తి యణచు దామచ ప్రకృతులన్;
దైవనింద సేయ దగదు భువిని;
నిన్ను నిందచేసి నీల్గరే కౌరవుల్?
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 90

ధర్మబద్ధులైరి ధర్మజాదులు సదా
జగతి మనుజకోటి సన్నుతింప
ధర్మమొసగె జయము, దైవంబు తోడ్పడె
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 91

కృష్ణ! నిన్ను గొల్చి ఖేదంబు సహియించి
పాండు సుతులె జయము పడసినారు
కృష్ణ! నీదు భక్తి కీడు రానీయదు
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 92

బంధు కలహమందు బహుచురుండవై
పాండు సుతుల బాధ బాపితీవు
రాజనీతి చూపి రాజిల్లితివిగదా!
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 93

రాయబారివగుచు రాజనీతి నీదెల్ప
రాజసభను నా డు తేజమొప్ప
సంధియత్నములను సల్పితివోర్పుతో
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 94

మాయచేయు జనుల మాయతో నోడించు
మాధవుండ! నీదు మహిమ మఱచి
మాసిపోయిరవని మందులై కౌరవుల్
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 95

మాయయున్న నీదు మాయయే మహనీయ
మహిమ మదియె గాదె మాధవుండ!
ఆటమాటలెల్ల నరయగా మాయయే
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 96

దివ్యదృష్టినిచ్చి ధృతరాష్ట్రునకు నీదు
విశ్వరూపమెల్ల విశదముగను
జూపనంధరాజు జూచి తరించెను
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 97

అవ్యయా! ముకుంద! భవ్యదివ్య చరిత్ర!
పాండునందునులకు నండవగుచు
నెల్లవేళలందు నీయవే శుభముల
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 98

సృష్టిచేయనేల! సృష్టిమాపగనేల?
సృష్టికన్న వేఱె దృష్టి నీకు
లేద! సృషిలోన లీనమయ్యేదవేల?
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 99

నామరూపరహిత! నారాయణా! హరీ!
నరుని గాచినట్లు నన్ను గూడ
గాచి ప్రోవుమయ్య కలికాలమందును
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 100

ఇహము నందు నాకు నిచ్చయే లేదయ్య
పరము నొస గుమయ్య పరమపురుష!
ఇహము పరము నీవె యింద్రియాధిప! దేవ!
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 101

ప్రాణికోటియెల్ల పరమాత్మ! నీ రూపె
ఆత్మనెఱుగ జేయు మాత్మరూప!
పరమ భక్తి నొసగి పరమాత్మ! కైకొమ్ము
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 102

శతకమందు నీదు శక్తిని వర్ణింప
నలవికాదు నలువకయిన, గనుక
సాహసించు నన్ను క్షమియించి మన్నింపు
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 103

రామశతకమేను రచియంపనదిగాంచి
నాతనూజ 'రాధ' నన్ను కృష్ణ
శతకకృతిని గూడ సమకూర్చుమని కోరె
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 104

అటుల మాయికముగ నాడిన నా బిడ్డ
లే త హృదయమందు పూత దొడిగి
నట్టి వాంఛ దీర్ప నిట్టుల బూనితి
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 105

కృష్ణశతకమెవరు తృష్ణతో బఠియింతు
రట్టివారికెల్ల నాదరించి
సతము బ్రోవుమయ్య సర్వేశ్వరా! హరీ!
భక్త వరద! కృష్ణ ! ముక్తి దాత! 106

సంపూర్ణము

-------

## భగవాన్

## శ్రీ సత్యసాయి శతకము

సత్యసాయి! నీకు సాష్టాంగనితి జేసి
సన్నుతింతు నిన్ను శక్తి కొలది
సర్వజనుల బ్రోవ సాక్షాత్కరించిన
సత్స్వరూప! సత్యసాయిబాబ! 1

ఈశ్వరాంబ తనయ! ఈశ్వర! భవహర!
ఎట్టి పుణ్యవతియె యీశ్వరమ్మ
భవ్యమూర్తి వయిన బాబ! నిన్నని పెంచె
సత్స్వరూప! సత్యసాయిబాబ! 2

బాల్యమందు నీవు బహు భాష లెఱు గవు
శాస్త్ర లేశమైన జదువ వైతి
గురువులపుడు నీదు గుట్టెఱుంగరు కదా!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 3

నేడు చూడ నీవు నిఖిల భాషావేత్త
వఖిల శాస్త్ర నిచయ మందు గూడ
కోవిందుండ వగుచు గోచరింతువు మాకు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 4

వేడు కోలు సల్ప బెక్కువ దేవత లేల?
కనుల యెదుట దివ్యకాంతి చిమ్మి
పరమశాంతి వరలు భవ్యుడ వీవుండ
సత్స్వరూప! సత్యసాయిబాబ! 5

జాతి కట్టడమున ఱాతి విగ్రహముగా
దేవుదుండ, నీవు దివ్య తనువు
దాల్చి మమ్ము గావ ధర బుట్టితివి దేవ!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 6

ఆత్మలింగ మనయ మాత్మలోన వహించి
ఆప్త భక్త వరుల యార్తి బాప
నాత్మలింగ మిచ్చి యాదరింపవె స్వామి!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 7

దశవిధాల దేవ దర్శనమును జేయ
గలము నీదు దివ్యకాయమందు;
ఆరయ రామ కృష్ణ లన గ నీవే సుమీ
సత్స్వరూప! సత్యసాయిబాబ! 8

తొల్లి షిర్డియందు దోచితి సాయిగా;
నే డు పుట్టపర్తి వీడు నెలవు
గా గ, సత్యసాయిగ నీవు వెలయవే
సత్స్వరూప! సత్యసాయిబాబ! 9

కంటికింపు గూర్చు కాషాయ వస్త్రముల్
నీదుమేన మెఱయ నీవు తరుణ
భాస్కరుడు గ గాంతి ప్రసరింప జేసెదు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 10

పుట్టపర్తి యిలను బుణ్య స్థలంబుగా
నిను భజించు భక్త జనులు తెలిసి
తండ తండము లుగ తరలి వత్తురు ప్రీతి
సత్స్వరూప! సత్యసాయిబాబ! 11

నన్ను గూర్చి చెప్ప నాకు శక్యము గాదు;
నీదు మహిమ గూర్చి నేను నుడువ
గలనె? యల్ప బుద్ధిగల మానవుండును;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 12

కలియుగాన మాయ కలత పెట్టుచు నుండ
గల్లబొల్లి మాటలెల్ల వినుదు
మనుజ తతికి నీదు మహిత మార్గము జూపు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 13

దేవళముల కరిగి దేవతార్చన సల్పి
దేవు జూడనట్టి జీవులకిల
సాయిదేవ; నీవు సాక్షాత్కరించెదు;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 14

జగతిలోన నీవు సద్భక్తు లొనరించు
సర్వ కర్మలందును సాక్షివగుదు
శాంతి నొసగి నీవు సద్గతి జూపుదు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 15

భవభయహర! సాయి! భక్తముక్తి ప్రద!
భక్తకోటి గాచు భారమూని
భక్తిని నెలకొల్ప భవము నొందితి నీవు;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 16

భక్తవరులు నిన్ను భగవానుడంచును
భజన చేసి మేలు పడయుచుంద్రు
భుక్తి ముక్తులిచ్చు పురుషోత్తము డలీవ
సత్స్వరూప! సత్యసాయిబాబ! 17

సర్వ భూతములను సాయి! వ్యాపింపవే?
సర్వమందు నీవె సంచరింతు
సాయి! నిన్ను జూడ సర్వంబు జూచుటే
సత్స్వరూప! సత్యసాయిబాబ! 18

సాయి! చూపగలవు సర్వంబు నీలోన;
హితుడ వీవు భక్త వితతి కెల్ల;
సతతము నిను గొల్వ శాంతి లభించెదు;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 19

భక్తి లేక నిన్ను బరికించు జనులకు
తెలియనగునె నీదు దివ్యమహిమ?
జన్మ శతములైన జాలువా నిన్గన?
సత్స్వరూప! సత్యసాయిబాబ! 20

భక్తులందు నీవు పరగ, దద్భక్తులున్
పరగుచుంద్రు నీదు ప్రకృతియందు;
సాయి గొల్చి జనులు సాయుజ్యమందరే?
సత్స్వరూప! సత్యసాయిబాబ! 21

ఈశ్వరుండ వగుట నిత్తు వైశ్వర్యంబు
భక్తజనుల కెపుడు భవ్యసాయి!
భజన చేయువారి భారంబు వహించియింతు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 22

నిన్ను జూడ మఱియు నీలీల లరయంగ
చిన్ని కృష్ణునివలె జెల గె దీవు
నటన యందు మిన్న నటరాజశేఖర
సత్స్వరూప! సత్యసాయిబాబ! 23

ఆర్ష తత్త్వ విదుడ! యజ్ఞముల్పేయించి
ఆర్ష సంస్కృతిలనిల నాదుకొందు;
ధర్మ దీక్షపూని ధర్మంబు నిల్పుదు;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 24

ఎవరి యిష్ట దైవ మెవరొ నీవూహించి,
అట్టి దైవలీల లపుడె చూపి
భక్త వరుల గాచు భగవాను డవు స్వామి!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 25

నిర్గుణుండవైన నీవు పూరుషరూప
మంది, యాత్మ నుండి యాత్మలింగ
మవల దీసి, దాని కభిషేకమును సల్పు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 26

నీవు కోరుకున్న నిన్ను భజింతురు
నీదు భక్తకోటి నీ కృపామృ
తము నిరంతరమ్ము తనివి తీర గ గ్రోల;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 27

కౌశికుండు నా డు కావించెనో లేదొ
సృష్టి కెనసెడు ప్రతిసృష్టి యొకటి?
చూడగలము దేవ? నేడు నీ సృష్టిని;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 28

శివుడె కేశవుండు శివకేశవుల కెప్డు
భేదమొదపదంచు నీదు భక్త
జనులకు సతతంబు చాటుచుందువు స్వామి!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 29

మనసునందు నిన్ను స్మరియించినంజాలు
మమత లెల్ల మదిని మాయమగును
తెలియ వశమెనీదు దివ్య మహ్త్వమ్ము
సత్స్వరూప! సత్యసాయిబాబ! 30

యోగ సిద్ధులు గల యోగీశుడవు నీవు;
నిన్ను గాన లేక నీదుయోగ
గరిమ నెఱు గ గలరె నరులీధరాస్థలి!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 31

భజనలందు బ్రీతి భక్తవరద! నీకు
పూజలందు బ్రీతి ముక్తిదాత!
దివ్యశక్తులున్న దేవుండవీవయా
సత్స్వరూప! సత్యసాయిబాబ! 32

పాపికూడ నీదు పదములు మట్టిన
బాసిపోవు వాని పాపచయము;
భక్తి కలుగ జేయు భగవాను డవు దేవ!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 33

జారచోరులయిన, సాధువంచకులైన
హంతలైన నిన్ను నాత్మలందు
దల చు నెడల మారి ధన్యులౌదురు కదా!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 34

నీదు జుట్టులోనె నీ గుట్టు కలదంచు
నీదు చోటు చేరి నీచబుద్ధి
నెఱపినట్టివారు నిజముగా పశువులే
సత్స్వరూప! సత్యసాయిబాబ! 35

నమ్మినట్టి జనులు నమ్మని వారలు
నిన్ను జూచినంత నీ ప్రశాంత
నేత్రయుగళి వారి నిశ్చేష్టులంజేయు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 36

మాయ యంద్రు నీదు మహిమలన్నియు జూచు
మలిన చిత్తులకట! తెలియలేక;
దానవారి లీల దైత్యు లెఱింగిరా?
సత్స్వరూప! సత్యసాయిబాబ! 37

పరమతస్థులొగిని పరమార్థ మర్థించి
నిన్ను శరణు జొచ్చి నీవు చూపు
సర్వమత విశాల సమదృష్టి నేర్తురు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 38

పుణ్య నరుల కీవు పురుషోత్తము డవయ్య;
భద్రమూర్తి వీవు భక్త తతికి;
పండి తోత్తములకు బ్రహ్మతేజుండవు;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 39

కాలు చేయిరాయ కలగెడు జనులకు
కాలు చేతులొస గి కాచువా డ!
కర్మ బంధములను గడముట్ట జేయుదు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 40

వైద్యమునకు సాధ్యపడని రోగుల దీర్ఘ
రోగ బాధలెల్ల రూపుమాపు
దివ్యవైద్య మెఱిగి తేజరిల్లెదవీవు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 41

పుట్టుగ్రుడ్డి నీకు బొడ గట్టగా వాని
కన్నుగవకు దృష్టి కలుగ జేయు
మహిమ నీకు గాక మఱియేరికుండును?
సత్స్వరూప! సత్యసాయిబాబ! 42

పంచభూతములను బంధింప జాలెడు
శక్తి కలదు నీకు సాయిబాబ!
పరమ శాంతమూర్తి ! భగవంతు డవు స్వామి!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 43

అమృతకరుని దర్శనమున సరస్సులో
గలువపూలు విచ్చుకరణినిన్ను
గనినయంత భక్త జనముల్ల నిల్లదే?
సత్స్వరూప! సత్యసాయిబాబ! 44

నీదు నాజ్ఞ జదల నీల మేఘమ్ములు
క్రమ్ముకొనెదు; మఱియు క్షణములోనె
మయమౌను నీదు మహిమచే నవియెల్ల
సత్స్వరూప! సత్యసాయిబాబ! 45

ఎటనొ తప్పు చేసి యే గుదెంచిన వాని
యెగ్గునీదు దివ్యదృష్టి నెఱు గ
గలవు; నీదు కన్ను గొప్ప గా శక్యమే!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 46

శీలరహితులైన స్త్రీ పూరుషులు నిన్ను
జేరి కొలువ భక్తి శీలమబ్బు;
సిరియు శీలమిచ్చు శ్రీశ ! యీశ ! విధాత !
సత్స్వరూప! సత్యసాయిబాబ! 47

భక్తి లేని పూజ భవనమ్ములో జేయు
గొప్పవాని కన్న గుడిసెలోన
భజన చేయు పేద భక్తుడే నీ వాడు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 48

గంపెడేసి పూలు గంధమ్ము విరశిమ్మ
సరము లల్లి పూజ సలుపనేల?
హృదయ కుసుమగంధ మీవు మెత్తువు గాదె?
సత్స్వరూప! సత్యసాయిబాబ! 49

భక్తిలేనివాడు బానతో బెట్టిన
పాలు ముట్టబోవు భవ్యసాయి!
భక్తి యొకటి చాలు; పరమాన్నమది నీకు;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 50

భక్తిలేని వట్టిరక్తితో బాడిన
భుక్తి నిత్తువేమొ ముక్తి నెంత
మాత్రమీవు; వాని మనసు నీ వెఱు గవా?
సత్స్వరూప! సత్యసాయిబాబ! 51

నీకు భక్తినిడిన నిత్యనివేదనల్
పర గు మాకు మధుర భక్ష్యములుగ;
నీవు ముట్టుకున్న నిస్సారమగునవి;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 52

మనుజ జన్మమెత్తి మాయలోబడి పోయి
చేయరాని పనుల జేసి చేసి
పుట్టపర్తి కేగబుట్టు సుజ్ఞానంబు;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 53

భవము నెత్తి దైవభక్తి భావంబులు
మృగమైన నరుడు మృగము వంటి
వాడు; నీవు కరుణ జూడ మేలొంద దే
సత్స్వరూప! సత్యసాయిబాబ! 54

ఎన్ని జన్మలెత్తి యెన్నాళ్ళు బ్రతికిన
సాయినామ జపమె చాలునాకు;
మధుర మధురమైన సుధయౌను నాకది;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 55

భజనమన్న నీదు భజనమే హృద్యంబు
పూజయన్న నీదు పూజమేలు
జపమె యన్న నీదు జపము శభంబిదు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 56

సాయి ! తండ్రి వీవె చల్లని తల్లివి
సాయి ! నీవె నాకుహాయి గూర్తు
సాయి ! నీవె మిన్న సర్వంబు కన్నను
సత్స్వరూప! సత్యసాయిబాబ! 57

నీదు జపము చేసి నిన్ను జూచెద సాయి !
నిన్ను బూజచేయ నన్ను జూతు
సాయి ! నీవె నాకు జగతిలో హితు డవు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 58

అన్ని యాత్మలయందు నధివసించిన స్వామి !
నాదు మదిని జూతు నీదు రూపు;
నిన్ను జూచినపుడు నన్ను నేనెఱుగుదు;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 59

కన్ను మూయ నీవె కన్ను విప్ప గనీవె
కానుపింతు వెడ ద గలుగు శాంతి;
నీదు రూపులోనె నిర్గుణత్వ మెసంగు;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 60

చేరి యడుగ నేల ? కోరి నీ వాస గవా?
యీయ దగిన వీవె యిచ్చుచుందు
భక్తకోటి కాప్తబంధు డ నీవెగా
సత్స్వరూప! సత్యసాయిబాబ! 61

లోభివాని ధనము లోకులు హరియింత్రు;
ధనికుడైన వాడు దాతయైన
అతని విత్తమునకు హాని వాటిల్లదు;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 62

ధనము నరుల కిత్తు ధనుదుడ ! ధనమును
దాన ధర్మములకు తగిన రీతి
వాడు నట్టి నరుడు బాబ ! నీ శిష్యుండు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 63

ధనికులైన శాంతి గనుక నీ పదముల
వ్రాలుచుంద్రు; నీవు వారి వెతల
దీర్చి పరమశాంతి గూర్చు చుందువు స్వామి
సత్స్వరూప! సత్యసాయిబాబ! 64

కలుషమతులు గాని కఠినాత్ములును గాని
వినయ మొప్ప నిన్ను వేడినపుడె
వారి జేర దీసి వరములిత్తువు గాక!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 65

ఆత్మ శుద్ధి లేని యాడంబరమునకు
వశము కావు నీవు ; ప్రవిమలాంత
రంగ శౌచమె నినురంజింప జేయును
సత్స్వరూప! సత్యసాయిబాబ! 66

దేశమందు నేడు దేవళంబుల గూల
దీయబూనినారు మాయ నరులు
కొంద, అకట! వారి మందలింపుము దేవో!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 67

జాతి యొక్క పూర్వ సంస్కృతి దెలిపెడు
క్షేత్ర ఖండములగ క్షితిని వెలయు
దేవళముల గావ దివ్యశక్తి ని జూపు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 68

కలియుగమ్ము నందు గల్పకద్రుమముగా
వెలసితీవు భక్తి నిలయమైన
భరతభూమియందు భక్తులు కొల్వగా;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 69

భరత భూమి నుండి పరిపాలనము పోయె
స్వీయె పాలనంబు చేకుతినది;
స్వీయ నాయకులకు శీలసంపద లిమ్ము?
సత్స్వరూప! సత్యసాయిబాబ! 70

మునుల ఋషుల గన్న పుణ్యదేశమ్ముగ
భరతభూమి పేరువడసె నట్టి
యావని నేడు నెగడు నజ్ఞుల మార్చెడి
సత్స్వరూప! సత్యసాయిబాబ! 71

దేశ సేవ మరచి దేశనాయకులిల
స్వార్థపరులుగ నెసంగనేల?
దేశ నాయకులకు ధీశక్తు లీయవా?
సత్స్వరూప! సత్యసాయిబాబ! 72

దేశభక్తి గలిగి దేశ సేవను జేయ
దేశమునకు కల్గు దివ్యరక్ష
దేవభక్తి యున్న దేశ సేవయె మిన్న
సత్స్వరూప! సత్యసాయిబాబ! 73

దుష్టహృదయములకు విశిష్టబుద్ధి నొసంగు
శీలపాలకుడవు శిష్టసాయి !
సత్త్వ గుణరతుండ! సర్వేశ్వరా ! స్వామి
సత్స్వరూప! సత్యసాయిబాబ! 74

సంఘ సేవ చేయు సజ్జనుల్ నీవారు
సంఘ రక్షకుడవు సత్యసాయి
శాంతి ధర్మ నిరత సత్యరూపు డవీవు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 75

అద్వితీయమైన యణుశక్తి, కన్న నీ
యాత్మశక్తి మిన్న యర్కతీక్ష్ణ
కిరణబంధురాస్య ! పరమతేజోమయా!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 76

విశ్వశాంతి నేర్పు విద్యయే నీ విద్య
విశ్వశాంతి గూర్పు విజ్ఞుడవయి
వివిధ మతము లీవె విశదీకరింతువు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 77

మతము పేరు చెప్పి మత బోధకులు చేయు
మాయలెన్ని యేని మహిని గలవు;
మాయలేని విశ్వమంత బోధ నీ బోధ
సత్స్వరూప! సత్యసాయిబాబ! 78

నీదు సత్యమతము నేర్చిన మానవ
జాతులందు భీతి సమసిపోవు;
మారణాస్త్రములను మట్టిలో గలియవా?
సత్స్వరూప! సత్యసాయిబాబ! 79

మనుజ జన్మమన్న మహినుత్తమంబగు;
మనుజు డజ్ఞు డగును దనకు దానె;
జ్ఞాన మొసగి మనుజ సంతతి గావుమా
సత్స్వరూప! సత్యసాయిబాబ! 80

దేహమరయ దివ్య దేవాలయం బంద్రు ;
జీవుడందు వెల్గు దేవు డంద్రు ;
అట్టి యెఱక నిశ్చయమ్ముగ నాకిమ్ము
సత్స్వరూప! సత్యసాయిబాబ! 81

విద్యయన్న వేద విద్యయే జగతిలో;
నీదు నుడుల గలదు వేద విద్య;
నిగమసార మెల్ల నీ వాక్యముల దో చు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 82

వేదములను నిమిడె విశ్వ రహస్యమ్ము ;
విశ్వ మర్మమెఱ గి వెలు గు నీవు
వేదమూర్తి వగుదు ; వేద మతోద్ధార !
సత్స్వరూప! సత్యసాయిబాబ! 83

శ్రుతులు గఱచినట్టి శ్రోత్రియ వర్గమున్
దూషణమ్ము సేయు దోసకాండ్రు
బుద్ధిబాగు పడ గ బోధింపు మో దేవ!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 84

శ్రుతులు చదువుచుండ్రు శుద్ధ మోక్షము గోరి?
శ్రుతుల జదువ నేల ? శుద్ధ మోక్ష
సిద్ధి కరుణ నీవు చేకూర్చ గా స్వామి
సత్స్వరూప! సత్యసాయిబాబ! 85

ఆత్మ గూర్చి తెలియ నాశ్రయించిన వాని
సహము వీడుమంచు నానతిత్తు
వయ్య యదియె యతిరహస్యమౌ సత్యంబు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 86

మమత మానవునకు గనుల సత్రము నందు
నిలిచి యంటనట్టి నీటికణము
వోలె నందు వేని పొసగును సౌఖ్యంబు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 87

మూఢమతిని నేను ; మూఢత్వముంబాపి
మోక్షవిద్య దెల్పి ముక్తి నిమ్ము
నీవు నేర్పగలవు నిఖిల రహస్యముల్
సత్స్వరూప! సత్యసాయిబాబ! 88

గురుమ లిలను గలరు కోట్లకొలంది; త
ద్గురుల నిన్ను బోలుగురు డు కల డె ?
బుద్ధి నుద్ధరించి మోక్షంబు నీయవే
సత్స్వరూప! సత్యసాయిబాబ! 89

ఉపనిషత్తు లిచ్చు నుత్త మజ్ఞాంబు ;
నుపనిషద్వికాస మొందినీవె
యిత్తు మాకు నుత్త మోత్తమ జ్ఞానంబు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 90

సాయి! నీవు తెలుపు సరణి సాధించెడు
సాధకునకు ముక్తి సాధ్యమగును;
నీవు తెలుపమాట నిజము ముక్తికి బాట
సత్స్వరూప! సత్యసాయిబాబ! 91

అష్ట సిద్ధు లొస గు నష్టాంగ యోగంబు ;
యోగివలెని దివ్యయోగమహిమ
లెల్ల జూపి నరుల యిడుమల బాపెదు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 92

శరణు జొచ్చునట్టి శరణాదులకు బ్రీతి
జ్ఞానశక్తి నొస గి కాచెదవు
భక్తి మక్తు లొస గు భగవాను డవు నీవె
సత్స్వరూప! సత్యసాయిబాబ! 93

నీదు చరణములను నియతిమై బూజింప
సుఖము లిచ్చు మతియు శుభము గూర్తు
సాయి దేవ ! నిన్ను సర్వదా పూజింతు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 94

సర్వదేవ రూప ! సత్య హృదయ ! యీశ !
శరణు వేడచుంటి స్వామి! నిన్ను
సర్వ వేళలందు సాయి ! కావుము నన్ను ;
సత్స్వరూప! సత్యసాయిబాబ! 95

ఆర్త భక్తుల నిల నాదుకో దల చియే
యవతరించి తిప్పుడాది దేవ!
బోధ చేసి జనుల బాధల బాపుదు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 96

పరమ భాగవతులు భగవాను డవిని నిన్
భజన చేయుచుంద్రు పరము గోరి
భక్తరక్షకుడవు భగవానుడవె స్వామి!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 97

ప్రాణదాత వీవు పరమేశ? సాయిశ!
విభవ మిత్తు వీవు విష్ణురూప?
నీదు సృష్టి నిలుచు నిత్యమై సత్యమై
సత్స్వరూప! సత్యసాయిబాబ! 98

సిరిడి సాయి బాబ తిరిగి జన్మంబెత్త
సత్యసాయివైతి జనుల గావ
భక్తులనెడి సిరిడి భగవాను డవు నీవె
సత్స్వరూప! సత్యసాయిబాబ! 99

"ఈ భవమ్ము ముగియు నీభువిన్ బ్రభవింతు
బ్రేమ సాయి యనెడి పేరితోడ"
అనుచు భక్తకోటి కానా డె తెల్పితి
సత్స్వరూప! సత్యసాయిబాబ! 100

నీవె దేవుడవని నీవెఱింగితి స్వామి !
సత్యసాయి! నీవు శాశ్వతుడవు !
జనుల గావ మరల జగతిలో జన్మించు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 101

తనువు దాల్చినట్టి దైవంబు నీవని
తెలివి యున్నవారు తెలిసికొనరె?
కలిని వెలిసితీవు కైవల్య మొస గ గా
సత్స్వరూప! సత్యసాయిబాబ! 102

ఆగమ విధి తోడ నర్చకుల్ నీకును
పూజ చేయుచుంద్రు పుణ్యమూర్తి!
సర్వ మనుజసేవ్య! సకల శుభప్రద!
సత్స్వరూప! సత్యసాయిబాబ! 103

వేలకొలది జనులు వేచియుందు రెపుడు
వేడ్కతో నినుగన వేదవిద్య!
కోరికలను వఱచి కొలుతురు నినుమదిన్
సత్స్వరూప! సత్యసాయిబాబ! 104

జపమి కేల నిన్ను సతతము చూడగా
తపమి కేల నీదు తనువు చూడ ;
జప తపః ఫలమ్ము సాయి మాకిత్తువు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 105

ఈ ప్రశాంతి నిలయ మీ కలియుగమున
సాయి నిలయ మగుట జనులుదీని
నాశ్రయింతురు సుఖ మాత్మశాంతిని గోరి
సత్స్వరూప! సత్యసాయిబాబ! 106

సాయి శతకమేను సద్భక్తితో వ్రాయ
శక్తి నొస గితివె సత్యసాయి!
కృతి నొసంగుచుంటి గృపతోడ గైకొను
సత్స్వరూప! సత్యసాయిబాబ! 107

సాయి శతకమెవరు చదివిన వినినను
సర్వసుఖములంది యుర్విశాంతి
బడయగలరు; పిదప భవ్య ముక్తి యుగాంత్రు
సత్స్వరూప! సత్యసాయిబాబ! 108

ఓం తత్సత్
శ్రీ సత్యసాయి బాబార్పణమస్తు

సంపూర్ణము

## భగవాన్
## శ్రీ సత్యసాయి సూక్తి ముక్తావళి

లెమ్ము ! మేలుకొనుము! యిమ్మగా సాయి సా
మ్రాజ్య మవని సుజన భోజ్యముగను
స్థాపనంబు చేయ సత్యధర్మ ప్రేమ
శాంతి చయముపైని సాయి భక్తి ! 1

సర్మమేక మనెడి సత్యంబు గ్రహియించి
సర్వజనుల యెడల సమతనుండు
విశ్వమంత యొకటె విశ్వహితము కోరి
సాటి మానవునకు సాయపడుము 2

మసలుచుండు మెపుడు మంచిగా జగతిలో
మంచిచూడు మీవు మంచి చేయు
మంచి మార్గమదియె మాధవు జేరగా
సత్యసాయి సూక్తి సర్వహితము 3

ధనము వచ్చుచుండు ధనము పోవుచునుండు
నీతి మార్గముననె నీవు నడచి
త్యాగ ధను డ వైన ధన్యత గాంతువు
నిత్య సుఖిని జేయు నిన్ను నీతి 4

నీతితోడ నీవు నిత్యంబు జీవింప
నీతియెస గు నీకు నిత్య సుఖము
పూర్ణ జీవిత మిల బొందెద వప్పుడే
సఫల మగును నీదు జన్మ మిలను 5

కాలము హరియించు ఘనుల నైనను మఱి
కాలహరణ చేయ గల్గు హాని
జీవితంబు వ్యర్థ జీవితంబగు గాదె
కాలము వృథ చేయ గనవు ఫలము 6

ఈ క్షణంబు నందె యేమంచి పని నైన
జేయ నుత్తమంబు ; చేయవలదు
కాలహరణ మింక ; గడిచిని కాలంబు
మరల రాదు ; తెలియ దరమె ? భావి 7

ఆత్మ విదుల భాష యగును నిశ్శబ్దమే
యందు విన గ జెల్గు నమరవాణి
మది లహరుల ధ్వనిని మహిత నిశ్శబ్ధమే
యణచి విన గ నిచ్చు సమరవాణి 8

కలలు కనుటలోనె గడపక కాలంబు
బ్రహ్మ మరయ జీవభావ ముడుగు
మనుజ జన్మమందె మాధవు గాంచు మా
సత్యసాయి సూక్తి సర్వహితము 9

మాయలో బడుకుము ! మాయాజగము జూచి ;
ఆత్మ శాశ్వతంబె; మరయు మదియె
చరమగమ్య మదియె పరమ సత్యంబును
అంత మాది లేక యట్లె యుండు 10

'బ్రహ్మ మెఱు గు వా డు బ్రహ్మ మేయగు' నను
వేద వాక్కు మనము వినమె భువిని
బ్రహ్మ పదము దేవ పదము నా పరమాత్మ
శబ్ద వాచ్యనుంద్రు శాస్త్రవిదులు 11

లౌకికాభివృద్ధి లౌకిక భోగము
లనుభవించుటకయి యవనియందు
జన్మమెత్త లేదు జను డ ! నిక్కము గాను
ఆత్మ నెఱు గ యోగమభ్యనింపు 12

దేహి మనుజు డౌనె దేవాత్మరహి తు డై
దేహి యంశలేని దేవు డుండు
దేహమందె యున్న దేవుని గాంచుమా
సత్యసాయి సూక్తి సర్వహితము 13

సర్వజీవులందు సర్వదాయుండెడి
దివ్యతేజము గన దీక్షపూను
మదియె యంతరాత్మ యదియె దైవంబును
సత్యసాయి సూక్తి సర్వహితము 14

ఈ చరాచర మగునెల్ల జగతియందు
నిమిడియున్నదయ్య! యేకత మరి
దాని నెఱు గు వా డె తథ్యంబుగా నొందు
పరమ సుఖము శాంతి భద్రముగను 15

అన్ని మతము లరయ నాయొక్క గమ్యము
నన గ నొక్క దేవునట్టె చేర్చు
మార్గములని వాని మర్మ మెఱు గ దుల్య
గౌరవమును జూపు ఘను డ వౌదు (క)

మతములన్ని నీదు మనుసును శుద్ధిగా
వించు కొనియె నీకు వేద్యమియన
నీదు వాత్మ నీవె నేర్పుతో నెఱుగ గా,
ప్రేమ పెంపొనర్ప బ్రీతి దెలుపు (ఖ) 16

నీవె సత్యమంచు నిజముగా నెఱు గుము
పగలు చూచునదియు బగటి కలయె
గాఢనిద్రయందు గాంచినయదిరాత్రి
కలయె గాని నిజము కాదు సుమ్ము 17

నీదు హృదయ మందు నిత్యముండెడి బ్రహ్మ
మంతరాత్మ సాక్షి యగును నెప్డు
నెచటొ దైవముండె నేమి చేయు నటంచు
దాచలేవు పనిని దాగ దదియ 18

అఖిల జీవులందు నిధివసించెడి యాత్మ
దేవుడనిరి నా డు దివ్యమునులు
మానవునకు జేయు మంచి సేవయై మాధ
వునకు జేయు పూజ, పుణ్య మొస గు (క)

అట్లె మానవునకు హానిచేసిన లేక
దూషణంబు సేయ దోషగును
తథ్యముగ నవియె దైవ హానిగ మరి
దైవదూషణముగ దనరునయ్య! (ఖ) 19

మంచి చెడుగు; శాంతి మానసిక వ్యథ ;
సుఖము బాధకలుగు చుండు నీదు
నంతరంగమందు ; నావిర్భవింపవు
నీదు వెలుపలనని, నిజముగనుము 20

అంతరంగము దెస నాత్మాభి ముఖముగా
మనుసు త్రిప్పి కొనుము మహిమగనుము
శాంతి నొందియెప్డు సమభావయుతు డవా
నందమగ్ను డవగు నరవరుండ! 21

మంచి చెడ్డలైన మరి సుఖ దుఃఖముల్
ద్వంద్వములుగ జగతి దనురుచున్న
నొక్క నాణెమునకె యొప్పెడి రెండుమ
ఖంబులవియె నిజము గనుము మదిని 22

మోద ఖేదములకు మూల హేతువు నెప్డు
మనసెయంద్రు పూర్వ మౌనులెల్ల
బంధ మోక్షములకు బర గ జిత్త మెమోల
కారణమనినారు జ్ఞానధనులు 23

తథ్యముగను రెండు దశలు బాధకు లేని
యప్పుడు కలుగునె సుఖానుభూతి?
సుఖమనంగ రెండసుఖములకు నడుమ
నౌవిరామ మన గ నరయు మీవె 24

పరుల కొఱకు మేలు బాధ్యతతో జేయ
గష్ట నష్టములను గలుగ, వాని
ననుభవింపు మప్పుదరయుము నీ తోడ
దైవమున్నయట్లు ధర్మపరు డ ! 25

ఎద్దిబోధ చేయు నేకత్వమును; స్వార్ధ
రహితు బ్రుమకలితు మహిమని జేయు
నదియె సత్యమైన యధ్యాత్మాకంబగు
జీవితంబు మనకు శ్రేయమొస గు 26

ఘనులు నేర్పుతోడ జ్ఞాన దుగ్ధంబును
మంథసంబు నేసి మహిని గనిరి
విశ్వహితకరంబు వేదాంతనవనీత
మదియె సాధకులకు నభయమొస గు (క)

విద్యలందు బ్రహ్మవిద్యయే సద్విద్య
దాని నెఱు గు వా డు ధరణియందు
బరమ సత్యమెఱుగు బ్రాజ్ఞుడై సర్వంబు
నెఱుగ గలడు తానె నిక్కముగను (ఖ) 27

నీవు చేయు పనులు నీదునాలోచనల్
తిరుగనవియె రూపు దిద్దుకొనును
అవిప్రతిక్రియకును నవి ప్రతిధ్వనికిని
కారణములు మంచి గాంచనెంచు 28

తెలిసియో తెలియకొ దినదినంబొనరించు
మంచి చెడ్డ పనులు మంచి చెడ్డ
ఫలములిచ్చు; మంచి ఫలములనుగాంచగా
మంచియే సలుపుము మనుజ వరుడ ! 29

నరుడ ! జీవితంబు నడునదొక్క సరణి
జేతనున్న దైవస్థిరము కాదు,
ఇచ్చి పుచ్చుకొనుట యిచ్చతో జేయగా
సిద్ధపడుము మంచి బుద్ధి తోడ 30

ప్రేమ నిలుచునెపుడు ప్రీతితో నిచ్చుటన్
మిన్నయౌనదే క్షమించుచుంట ;
ఆత్మ నిలును నెప్పుడనుభూతి పొందుటన్ ;
విస్మరింప వ్యథను భీతి లేక 31

నీ మనస్సు నుండి నిర్మల భావనల్
వెలువడవలె గూర్ప వశ్వహితము
పలుకుము ప్రియ సత్యభాషణంబులు నోట
చేయుమా పవిత్ర చేష్టలెపుడు 32

ఒరులు మెచ్చునట్టి యుత్తమ జీవిత
మనని గడుపు వాడై యహము నుండి
బ్రహ్మము దెసకట్లె పయనించువాడని
బుధులు పుణ్యపురుషు బొగడు చుంద్రు 33

ప్రేమ గాంచవచ్చు బ్రేమయనెడి సులో
చనలమును ధరింప జక్కగాను
ప్రేమ రూపసాయి బ్రీతితో గాంతువు
ప్రేమ మయము జగము స్వామియము 34

ఎట్టి పనిని జేయనట్టిదే నీకగు
ననుచు మదిని దలప న్యాయముగను
చెడ్డపనులు చేయ జిత్త మొప్పదు నీకు ;
పరుల కొఱకు మంచి పనిని జేయ 35

క్షితిని మొట్టమొదట సేవకుండవు గాక
నాయకుడవు కావు నమ్ము నిజము
చిత్తశుద్ధి తోడ సేవచేసిన వా డె
నాయకుం డగుటయె న్యాయమార్య ! 36

నీవెఱుగుదువేని నీవు చేసిన తప్పు
ఆదియె జ్ఞానమునకు నాది సుమ్ము,
ఒప్పు చేయువాడె యుత్తము డిలలోన
జ్ఞానియైన వా డె గాంచు ముక్తి 37

ఒక్కవ్రేలితోడ నొరుని దోషము జూప
దలతువేని మూడు తప్పు లతడు
ముచ్చగను జూపు మూర్ఖుడ ! నీలోన
గాన నీదు తప్పు గనుము మొదట 38

ఆచరించి మొదట; నన్యుల కుపదేశ
మీయవయ్య పిదపనెప్పుడైన
పరులలోని తప్పు పరగ గాంతు వదియె
చేయకూడ దీవె చిత్తమునను 39

నీదు తప్పు నెవడు నెమ్మదిగా జూపు
నీకు వంద్యు డతడు నిక్కముగను
పరులవైపై త్రిప్పు భవదీయ నేత్రముల్
నీదు లౌని తప్పు నెట్లు చూచు (క)

కామరోషములను గర్వాంధకారంబు
కలుషితం బొనర్ప గనులు మూత
పడగ గాంచలేవు భదీయ దోషముల్
పరుల తప్పె నీవు పలుకు దెపుడు (ఖ) 40

సత్పురుషుల తోడి సాంగత్యమదియె, స
త్సంగ మవసరంబు ; సద్గుణాలు
సత్ప్రవర్తనయును సమకూడు నచ్చట
సాధన సతతంబు సల్పుమచట 41

పూర్వభవములందు బుణ్య పాపములను
నెన్నోచేసియుంటి వెఱుగనీవు
నీదు పుణ్యపాప నివహింబు నేర్పుతో
మాలగాను గూర్చి మాధవుండు (క)

నీదె నీ కొసగగ నీవు నద్దానివే
గళము చుట్టు గలిగి కర్మఫలము
నవని ననుభవింపనందితి భవమ; నీ
పుణ్యపాపఫలము పొందుదీవె (ఖ) 42

దుష్టకర్మమెపుడు శిష్టఫలములీ దు
శిష్టకర్మ మీదు దుష్టఫలము
నీవు నాటు విత్తు నియతితో వృక్షమౌ
పెరుగుచుండు చెట్టు విత్తు కతన 43

మరల జన్మమంద మనము పుట్టుట లేదు
బ్రహ్మము మనమూలపదము నిజము
ఎచట నుండి మనము నేతెంచియుంటిమో
యచటికే చనుటయు నార్షమతము (క)

బ్రహ్మమందు బుట్టి బ్రహ్మమందు బెరిగి
యందె లీనమగుట యందఱకిని
పరమగమ్యమగుట బ్రహ్మపదమొకటె
జీవితాంతమందు జేరదగును (ఖ) 44

బ్రహ్మమెపుడు నీకు బాహ్యమందున లేదు
దైవమనిన బ్రహ్మమై వఱలును
నిజము బ్రహ్మమెపుడు నీలోన నున్నదే
యదియె యాత్మ దాని నరము మిపుడె 45

నీవు నీ జగమున నివసించినను నెట్టి
హాని లేదు సత్యనురయు మీవె
నిలువనీకు జగము నీ లోననెన్నడు
సత్యసాయి సూక్తి సర్వహితము 46

దివ్యచిత్తమందు దేవుని నెలకొల్పు
త్యాగపూత దేహదళము నందు
మంచి భావఫలము లుంచు నీవైన యా
నంద బాష్పములును నమ్రమతిని 47

మనసునందె పూజ మాధవున కొనర్పు
మదియె యధి ఫలము నట్టి యిచ్చు
నీవయిన సుగంధ నిర్మలగుణముల
నర్పణంబు సేయు మతని కిపుడె (క)

నమ్రభావమెప్ప నపరాధముల నెల్ల
తల చి వగచి యిమ్ము దైవమునకు
నీదు సుగుణములను ; నిన్ను నీ వెఱుగ గా
గంటితడిని గడిగి గారవమున (ఖ) 48

దైవశక్తి యందు దనరు విశ్వాసంబె
చక్కనైన బాట సాధకులకు
అట్టిదారి బోవ నాధ్యాత్మిక విజయ
మంద గల డు జను డు మాన్యు డగుచు 49

భక్తి యొక్క స్థాయి భగవంతు డెఱు గుటన్
భక్తియందె ప్రేమ పరగ జూపు ;
భక్తి కెవశుడౌను భగవంతు డెప్పుడు
జ్ఞప్తి యుంచు కొమ్ము సత్యమిద్ది 50

సర్వ విషములను సర్వేశ్వరేచ్ఛకు
వదిలివేయు మదియె పరమభక్తి
నాణ్యమయినది శరణాగతి భక్తియే
సత్యసాయి సూక్తి సర్వహితము (క)

లాభనష్టములను లక్ష్యపెట్టక నీవు
కష్ట సుఖము లెపుడు కల్గుచున్న
నిశ్చలముగ నమ్ము నీ యిష్టదైవమున్
సత్యసాయి సూక్తి సర్వహితము (ఖ) 51

మంచి పనిని జేయ మంచియే చేకూరు
చెడ్డఫలిత మబ్బు జెడ్డ పనికి
దైవదత్త ఫలము ధర్మ సమ్మతమౌట
ననుభవింపవలయు నవని జనులు (గ) 51

కాంచు దైవకృపను కరుణామయు డు స్వామ
భక్తి వలన గరుణ బడయ వచ్చు
రవికిరణములట్లు రాజెల్లు పరమేశు
కరుణయంతటయును గాంచుమయ్య 52

శ్రద్ధ భక్తి రెండు చక్కని సాధనల్
జీవింతపు నౌక చేర్చునొడ్డు
సరిగ పడవనడుప సంసార సాగర
తీరమనియె చేర్చు ధీరవరుని 53

ఇంద్రియంబు లెన్నొ యిక్కట్లు కలిగించు
మర్కటంబు మాడ్కి మనసు కూడ
విషయలలు జేయు వివిధ గతులవాని
నణచి దేవ పదమునందుమ్యు (క)

మునులు శమము వలన దనువు నింద్రియములన్
వారెదము వలన వారిచిత్త
మదుపు లోన నుంచి మాన్యయశులు తుద
కాత్మ తత్త్వ విధులు ఘనులు నైరి (ఖ) 54

మనసు దేవతత్త్వ మగ్న మైయున్నచో
నైహికమగు కర్మ లాచరించు
చున్న నంతరాయమెన్నడు నొందక
ముక్తి నొంద గలవు భక్తిపరుడ! (క)

మనసు తోడనైన మరికరంబుల తోడ
తనువు తోడనైన దనరు నెట్టి
చేయగలవొ దాని శ్రీ ప్రతికర్షింప
భోగమోక్షములను బొంద గలవు (ఖ) 55

భవములందు మనుజ భవ మతిదుర్లభం
బట్టి పుణ్యలబ్ధ భవమునందు
బశువు వలెనె నీవు మసల మనుజ జన్మ
దైవదత్తవరము దండుగగును 56

ఆత్మవంక చూడనంతర్ముఖంబుగ
ద్రిష్టబడిన మనసు దివ్యసుఖము
ననుభవించు గాన గనవు ఖేదంబును;
కష్ట సుఖము లీవు గాంచునపుడు (క)

సమతతోడ నుండు సమబుద్ధియె సమాధి
సమతగాంత వీవు సర్వమందు
దైవమందు గూడ దప్పక లీనమై
నిజసమాధియందు నీవెయందు (ఖ) 57

నిత్యజీవితంబు నియమబద్ధమొనర్చి
పాపభీతి కల్గి పనులు చేయ
దైవప్రీతియుండ దప్పక శాశ్వతా
నందమంద గలవు న్యాయశీల! 58

దైవదత్తబలము దైవబలం బండ్రు
ధర్మ లబ్ద బలము ధర్మబలము
ధర్మబలము లేని తనబలంబంతయు
ఫలరహితమె యగును ప్రాజ్ఞవర్య! 59

సత్యవాక్కు పలుకు సతతంబు ధర్మంబు
నాచరింపు మనెడి యార్షవాక్కు
జీవితంబునందు స్థిర లక్ష్యమైనచో
నందఱెపుడు వృద్ధినంద గలరు 60

ధర్మ రక్షణకయి దైవమవతరించు
ధర్మమున్నచోట దైవముండు
దైవమున్నచోట తథ్యంబు విజయంబు
విజయమెందు విశ్వ విభువికరణ 61

గ్రహగతులను బట్టి కష్టముల్ కలుగవు
దైవకృపను గాంచు ధార్మికునకు ;
దైవకృపను గాంచ దప్పక ప్రార్థించు ;
ప్రేమయుక్త భక్తి వీడకెపుడు 62

పిల్ల యేడ్పు వినుచు బ్రేమతో దల్లియే
పరువులెత్తి కాచు బానపుడె
అట్లె భక్తుని మొఱనాలకించుచు దైవ
మెచట నున్న నతని నచట బ్రోచు 63

శిష్ట హేతుబద్ధ చేష్టలు నవతార
పురుషు డెపుడు చేయు బుణ్యబుద్ధి
నతనిమాటచేత లర్ధవంతంబులే
యంత రార్థాయుక్త మతని చూపు (క)

అంతరార్థవంతమై యగాధమగునా
ధ్యాత్మికతయు నొప్పు ధర్మ కర్మ
లాచరించు నెప్పు డవతార పురుషుడు
జ్ఞాన వేద్యమతని కార్యఫలము (ఖ) 64

దేవు డంచు గొలువు దిట్టమౌ బొమ్మను
బొమ్మ దేవు డనుచు బూజవద్దు
దైవ పదమునకును దగ జేర్పు మేదైనా
దింపకెపుడు బొమ్మ స్థితికి హరిని 65

దైవనామమునకె దైవము వశమౌను
అన్యపద్ధతలకు నధిక ధనము
నకును లొంగ డెపుడు నారాయణు డు నిశ్చ
లమగు ప్రేమ భక్తులతని దెచ్చు 66

అంద జూడ కెపుడు నానంద శాంతులు
నీకు బాహ్యవస్తు నిచయమందు ;
అంద గలవు వాని నంతరంగమునందు
నీవు దృష్టి నిలుప నిశ్చలముగ (క)

అటుల జేయనీకు నానంద శాంతులు
నిత్యసత్యములయి నెమ్మనమున
గలుగ గలవు తుదకు గల్గును ముక్తియు
సత్యసాయి సూక్తి సర్వహితము (ఖ) 67

చిత్త శీలములును జెన్నుగా భావనల్
నీదు వాక్కు కర్మ నేర్చు తోడ
వాని సరణి గూర్చి పరిశీలనము చేయు ;
మనసు పిచ్చి కోతి మందలింపు (క)

పైని చెప్పినట్లు భద్రంబుగ జిత్త
మదుపులోన నుంచు మనిశమీవె;
అటుల జేయ నాత్మ మరయు గలవు సుమ్ము
సత్యసాయి సూక్తి సర్వహితము (ఖ) 68

అజ్ఞుడైన వాడె యాత్మ దేహంబంచు
దలచుచుండు నదియు దప్పె సుమ్ము
జనుని యాత్మమొకటి సర్వాత్మలోపల
మనుజ జాతి నొక్క మనుజు డత డు　　　69

మైత్రి భయములు నభిమానము నాధార
భూతమైన మైత్రి పొసగ దెపుడు
అన్ని వేళల నిను ననుసరించి మిత్రు
డత డె యీశు డయ్య! యతని నమ్ము　　　70

సర్వరక్షక కృప సచ్చిదానందంబు
నీదెస ప్రవహింప నిష్టతో ను
పాస నోపవాస భవ్య కార్యంబులు
చేయ నీశు చెంత చేర గలవు　　　71

దైవమునకు నెంత దగ్గర నుందువో
దైవముండు నంత దగ్గర గను
తల తువేని యెపుడు దైవమంతట నుండె
నంచు; నీదు దరిని నరయు మతని　　　(క)　　　72

అట్టి దైవభావమంతట గనినచో
నీవు దేవుడ వని నిక్కముగను
తల తు వెపుడు నీకు దైవమునకు భేద
మేమి లేదటంచు మిన్నగాను　　　(ఖ)　　　72

మాధవుని కరుణయు మానవకృషియును
నేకమైన గాని యెట్టి ఫలము
గాంచ లేవు; దైవకరుణను గాంచుము
భక్తి శ్రద్ధలతని పట్ల జూసి　　　73

హృదయ పాత్ర నుండి యీహాజలంబంత
నొలక బోయుమయ్య యొక్కతడవె
దానినతి పవిత్ర దైవనామస్మర
ణమను తైలపూరితము నొనర్చు　　　(క)

జీవుడ నెడియొత్తె చెన్నుగా వైరాగ్య
మనెడి యెండలోన నార బెట్టు;
కాంతి తోడ వెల్గు జ్ఞానా మరజ్యోతి
నరయుమదియె నీదు నాత్మకాంతి (ఖ) 74

శోచనీయమైన సోమరి తనమును
దుమ్ము తప్పుల వలె దోషయుతము;
స్వార్థరహితమగుచు చకచక సల్పెడి
పని విరామము దగుననిరి బుధులు 75

ముందు చేయగోరి తొందరపడ వ్యర్థ
మగును పని, విచార మందలంపు;
కాన నిశ్చలత నిదాన మొనర్పగజేయు
పని జయమును గూర్చు పందెమందు 76

నీదు కోపమెప్డు శత్రువగును
నీ ప్రశాంతి కాదు నీకు వజ్ర
కవచమగుచు; నీ వు గనెడి యానందమే
స్వర్గము; నరకము విచారఫలము 77

ఆవని జనుల కెల్ల నాదర్శమూర్తియై
ధర్మరక్షణంబు దాను జేయ
నవతరించినట్టి యవతార పురుషుడు
ధర్మబద్ధుడగును దనకు దానె (క)

ఘనులు నాయకులును క్రమశిక్షణకు లొంగి
చేసినవి పరులకు జెప్పవలెను
అట్టివారినెల్ల నవతార పురుషుడు
దివ్యశక్తి చూపి తీర్చిదిద్దు (ఖ)

సర్వసృష్టికర్త సర్వపోషకుడును
సర్వలయమొనర్చు సర్వమయుడు
దేవదేర్పరచిన దివ్యసిద్ధాంతముల్
తాను నాచరించు దప్పుకొనెడు (గ) 78

సాటి నరుని పట్ల సౌభ్రాత్రమును జూపు
మీశు దంఢ్రిగాను నెంచు మెపుడు
స్వార్థరహిత సేవ సల్పుము ప్రేమతో
నెఱుగు మన్నిట గల నేకత, మది 79

తప్పు చేయవచ్చు దప్పని తెలియక;
తప్పు తెలిసి కొన్న దనకు దానె
మరల జేయరాదు మహిలోన నా తప్పు
సత్యసాయి సూక్తి సర్వహితము 80

నీదు మాటలందు నీచేతలందును
భావ సరణిలోన బరగనెపుడు
ఖేదముండరాదు భిన్నత్వమున్నచో
బదులు మెచ్చరయ్య పరువపోవు 81

పాఠశాలయందు బహుకళాశాలల
నిత్యజీవితాన నేర్పు తోడ
'మార్కు'లందు దృష్టి మరలకుండ 'రిమార్కు'
లందకుండునట్టి లక్ష్యముంచు 82

జన్మభూమి నెపుడు జననిగా భావింపు;
దేశమాత సేవ్య దీక్షతోడ;
మాతృదివి నిల్పె మన సంస్కృతి ననుస
రింపు మొరుల ననుకరింప వలదు 83

సర్వజగమును నీవె సరిదిద్ది మంచిత్రో
వ నడుపుటకు మున్నె వాంఛ నింద్రి
యముల నదిమి నడత నాదర్శముగ జేసి
కొనుము నీకు నీవె ; కోర్కె దీరు 84

సర్వ వేదములను సత్యమే దైవంబ
నుచు వచించె; సత్యవచను డవయి
సత్యబుద్ధుడవయి సత్యమునే పొంద
గలవు బ్రహ్మమరయ గలవు నిజము 85

ఏడ్పుతోడ బుట్టు నే మానవుండైన;
నెవని జీవితంబు నేడ్పుతోడ
ముగియరాదు; జనుడు ముగియింపవలె జీవి
తంబు నవ్వుతోడ దనకు దానె 87

జీవితంబు నొస గె శ్రీమతి నికును
దేవు నెట్లో వెదకి తెలిసి కొన గ ;
గాన నీభవమున గాంచు మీ దేవుని
సత్య సాయిసూక్తి సర్వహితము 88

కన్నులియ బడియె ఘన పరమాత్ముని
దివ్య సర్వశక్తి దీప్తిగాంచ
దివిని భువిని దేవ దివ్యత్వమే నిండె
కన్నులార గాంచ వచ్చు మనము 89

చరణముల నొసంగె సర్వేశ్వరుండును
దివ్యశక్తి యుతుడు దేవుడున్న
యాలయంబు జేరి యతని దర్శింపగా
సత్యసాయి సూక్తి సర్వహితము 90

చేతు లొసగ బడియె జేయగా బూజను
దైవమునకు నీవు దమము తొడ
మంచి పనులు చేయ మనుజుల ప్రగతికి
సత్యసాయి సూక్తి సర్వహితము 91

శాశ్వతుండెపుడును సర్వేశ్వరుడొక డె
కంటి కగపడునది కాదు సత్య
మని యెఱుంగుటకయి మహిత బుద్ధి యొసంగ
బడెను నీకు గనుము పరము పదము 92

నాల్క యీయ బడియె నారాయణుని గుణ
గణము ఘనత పొగడ జ్ఞానయుతు డ!
నమ్రు దవయి యతని నామస్మరణ చేయు;
సత్యసాయి సూక్తి సర్వహితము 93

భక్తకోటియెపుడు భగవంతుని శుభనా
మమును రాగతాళమంజులముగ
కీర్తనంబు సేయ; కీలాలమును గ్రోల
వీను లీయబడియె విజ్ఞ ! నీకు 94

తను వొసంగ బడియె దగ బ్రాణికోటిని
నాపద సమయమున నాదు కొనగ
బరము కూడ బొందు భవ్య దేహము తోడ
సత్యసాయి సూక్తి సర్వహితము 95

భువన మంతటికిని మూల మీశ్వర ప్రేమ
చిత్తమందు బ్రేమ చెలగనట్టి
పండితుండయినను బరమ వేవికియు
వ్యర్థ జీవులంద్రు భవ్యబుఝులు 96

ఈశ్వరుండె ప్రేమ యీవు ప్రేమమునందె
స్థిరముగా గడువుము జీవితంబు
దినము ప్రేమ తోడ దీక్షగా మొదలిడు
నింపు ప్రేమ తోడ నీదు దినము (క)

దినము ప్రేమ తోడ దిట్టవై ముగియింపు
మదియె మంచి పథము హరిని చేర
బ్రేమ మయు డు స్వామి ప్రీతితో గొలువుము
సత్యసాయి సూక్తి సర్వహితము (ఖ) 97

తల్లిదండ్రుల యెడ దగు ప్రేమ చూపుచు
దైవభావమొప్ప దగును నీకు
వారి సేవసల్పు భగవానుని యనుగ్ర
హం బనిశము పొందు హాయిగాను 98

వివిధ గ్రంథములను వేమాఱు చదువుటన్
తలకు నెక్కి నట్టి తద్విషయము
జ్ఞానమయిన నీకు గలుగ జేయదు మేలు ;
నింపు చిత్రమందు నిండు ప్రేమ (క)

వేదశాస్త్ర లబ్ద విజ్ఞానమెంతైన
శివుని పాదములను జేర్చకున్న
నిష్ప్రయోజనంబె నీకట్టి జ్ఞానంబు
ప్రేమలభ్యుడతడు ప్రేమచూపు (ఖ) 99

పాపఫల మొసంగు బరుల కపకృతియె
ఉపకృతిని సలుపుమ యొరుల కెప్డు
దూరముగను బొమ్ము దురితంబు చేయడ
ఇదియె వేదశాస్త్ర విధి యెఱుగు 100

శక్తి చాలకున్న సాహాయ్య మొనరింప;
సల్పరాదు హాని ; సాటి వాని
మనసు బాధ చెందు మలిన కృత్యంబులు
మానుమింక నైన మనుజు డవుగ 101

మరువ కిశునెప్డు మనసునందైనను
మృతికి వెఱవకీ వమృతు డవగుము
సత్యదేవునందు సాయుజ్య మందెడి
శుభసమయమునకును చూడు మీవె 102

విద్య యొసగు చుండు వినయంబు నరునకు
వినయ మున్నవాడె విజయుడగును
తగిన వారికడ సుదాత్త విధేయతల్
చూపగాంత మీవె శుభము లెల్ల 103

ఆత్మ విద్య మఱియు నాధ్యాత్మిక జ్ఞాన
మున్నవా డె పొందు ముక్తి ధ్రువము
పరగ నైక్యమొంద బరమాత్మ జీవాత్మ
లాత్మ విద్య నీకు నవరసంబె 104

మార్గదర్శకములు మహనీయ విరచిత
గ్రంథరాజములను గమ్యమునకు;
గమ్యమునకు జేర గనపర్చునవి దారి ;
అట్టి దారి నే గి యాత్మ గనుము (క)

అనుభవంబు తెల్పు నాధ్యాత్మిక గ్రంథ
మూలముగనె నా డు మునులు చూపి
నట్టిదారిని జన నానందమును బొంది
ముక్తి మార్గగామి ముక్తినొందు (ఖ) 105

అనుభవంబు వలన నలవడు జ్ఞానంబు ;
నీదు ననుభవంబు నెఱు గ జెప్పి ;
యన్యులకును నీవె యానందమును గూర్చు ;
సత్యసాయి సూక్తి సర్వహితము 106

దైవ సూచనలను దప్పక పాటింప
గూఢముగ మది గల గురువు యొక్క
శక్తి మంతమయిన సాక్ష్యాత్కృతిని బొందు ;
నీదు చిత్తమందు నిల్చునతడు 107

నీదు హృదయవాసి నిత్యుడౌ సాయినే
నిల్పు కొనుము మదిని నిష్ఠతోడ ;
సాయి యొస గు నీకు సచ్చిదానందంబు
శాంతి ; ముక్తి నొందు శాశ్వతముగ 108

## ఫలశ్రుతి

ఈ ప్రశాంతి నిలయ మీశ్వర శక్త్యవ
తార సత్యసాయి ధామ మిపుడు
అతని సూక్తు లివియె యష్టోత్తర శతంబు
సాధకులకు ముక్తి సాధనములు

సంపూర్ణము
శ్రీ సత్యసాయి శ్వరార్పణమస్తు

ఓం తత్సత్

## దశ విధవతారధారి సాయి

**– రచన : డా॥ ఎం.వి. సత్యనారాయణ**

1. స. స్వాగతమో సత్యసాయి శభాక్తాగ్ర
 గణ్యులారా ! పుణ్యకర్తలారా!
సాయి దర్శనమును సల్పిన భక్తుల
 పాపచయంబంత భస్మమగును
సాయి పాదంబుల స్పర్శచే భక్తుల
 యజ్ఞానమంతయు నంతరించు
సాయి సంభాషణ సల్పిన భక్తుల
 కాత్మబోధయు గల్గు హంసలారా!

ఆ.వె. పుట్టపర్తి నేడు పుణ్యభూమి యిలను
ఈశ్వరాంబ తనయుఁడిమ్ముగాను
వెలసియుంట నచట విశ్వజనులగావ
దశవిధావతార ధారి సాయి

2. పంద్రెండు వత్సరాల్ పలు బాధలందుచు
 స్వర బేధముల తోడ శ్రావ్యముగను
వేద మొక్కటెఱుంగు వేదపండితులను
 ఐహిక బాధతో నలమటించి
వేద తత్త్వ మెఱుగు విజ్ఞానమే లేక
 శాంతికై మన సత్యసాయి గొల్తు
సంపన్నులును తమ శక్తిని గోల్పోయి
 శాంతికై మన సత్యసాయి గొల్తు

శిరిడిసాయి నాడు సిద్ధి పొంది పిదప
సత్స్వరూపుడయిన సత్యసాయి
యనెడి పేరితోడ నా పుట్టపర్తిలో
వెలసె దేవు నెఱుగు విధము దెల్ప.

3. రామచంద్రుడు నాడు రాజ్యంబు పాలించి
సర్వులకును సుఖ శాంతు లొసగె
రామరాజ్యము నేడు రహి తోడ నెలకొల్పు
రాముడే మనసాయి రాముడయ్యె
గోపాలకృష్ణుండు గోపికల్ సేవింప
మురళిని మ్రోగించి ముక్తినొసగె
ప్రేమ తత్త్వము నేడు ప్రతీతితో బోధింప
కృష్ణుడే మన సాయి కృష్ణుడయ్యె
బాహ్యాంతర రిపుల భంజనంబును జేయు
దుర్గయే మన సాయి దుర్గయంద్రు
తుష్టిపుష్టి యొసగి శిష్యులగా చేయు
లక్ష్మియే మన సాయి లక్ష్మియంద్రు
అజ్ఞానము హరించి సుజ్ఞాన మొసగెడి
వాణియే మన సాయి వాణియంద్రు
విశ్వసృష్టి స్థితి విలయముల్ చేయు శ్రీ
మాతయే మన సాయి మాతయంద్రు
భౌతిక శాస్త్ర ప్రభావంబు కొనియాడి
దేవుడే మేడను దీనులకును
దేశ దేశాలలో దివ్యరూపము జూపు
సర్వాత్ముడౌ మన సత్యసాయి
మహిలోన భాషలు మతములు వేరైన
మానవత్వ మెఱిగి మసలుడంచ
మానవసేవయే మాధవ సేవని
సేవ చేయుచు సాయి చెప్పు మనకు
సర్వమతంబుల సామరస్యము దెల్పు
సచ్చిదానందుండు సత్యసాయి

మన సనాతన ధర్మమహిమలు దెల్పుచు
భారత ధర్మంబు భద్రపఱచు ;
సాధన చేసెడి సద్భక్తు లెల్లరు
దేహాలలో నున్న దేవునెఱుగ
బోధామృత మొసంగు పుణ్యసాయియె దేవు
డని యెఱుంగు దురిప్డె యార్యులెల్ల;

సత్యధర్మ ప్రేమశాంతులు నెలకొల్పి
భవభయహరుడగుచు భవ్యసాయి
ప్రేమసాయి యనెడి పేరితో ప్రభవించు
సాయి భక్తులెల్ల సంతసింప.

**సనాతన సారథి**

ఆగష్టు 1975

## సర్వదేవరూప

**రచన – డా॥ ఎం.వి. సత్యనారాయణ**

సీ. సాయి రామా ! దివ్య సత్యతేజోమూర్తి !
సాయి కృష్ణా ! యోగి సన్నుతాంగ !
సాయి రంగా ! ధ్యాన సంకీర్తన ప్రియా !
సాయి నారాయణా ! సాధు పూజ్య !
సాయీశ ! అభిషేక సంతుష్ట మానస !
సాయి రమణ ! భక్త శాంతిదాత !
సాయి గజాననా ! సర్వ విఘ్నాపహా !
సాయి స్కంధా ! భక్త శక్తిదాత !
సాయి ధాతా ! భక్త సత్కర్మ ఫలదాత !
సాయీంద్ర ! స్వర్గాధి సౌఖ్యదాత !
సాయి జగన్నాథ ! సత్యనారాయణా !
సాయి రామేశ్వరా ! శాంత రూప !
సాయి ! అమరనాథ ! సద్భక్త రక్షక !
సాయి విశ్వేరా ! సకల సుభద !
సాయి పశు పతీశ ! సర్వ ముక్తి ప్రద !
సాయి నృసింహ ! ఓ శత్రుదమన !
సాయి ! గగన మీవె సాయి తారక వీవె
సాయి ! నీవె భువన స్వర్గములను
సాయి ! సూర్యుడవీవె సాయి ! చంద్రుడ వీవె
సాయి ! గ్రహము వీవె శాంతి నీవె
సాయి ! నిధులు నీవె సాయి ! సంద్రము నీవె
సాయి ! సకల భూతచయము నీవె
సాయి ! కాలము నీవె సాయి! కాలుడ వీవె
సాయి ! కాలాతీత శక్తి వీవె
సాయి ! కర్తవు నీవె సాయి ! భోక్తవు నీవె
సాయి ! భోజ్యము భుక్తి సర్వ మీవె

సాయి ! ధ్యాతవు నీవె సాయి ధ్యానము నీవె
సాయి ! ధ్యేయము నీవె సత్స్వరూప !
సాయి ! జ్ఞాతవు నీవె సాయి ! జ్ఞానము నీవె
సాయి ! జ్ఞేయము నీవె సత్యదేవ !
సాయి ! సంపద నీవె సాయి ! ఆపద నీవె
సాయి ! ఆప్తుడ నీవె సర్వులకును
సాయి ! హరివి నీవె సాయి ! పితవు నీవె
సాయి ! సుతుడ వీవె స్వర్గమీవె
సాయి ! మానవు నీవె సాయి ! హితవు నీవె
సాయి ! సుతుడ వీవె స్వర్గమీవె
సాయి ! జీవుడ వీవె సాయి ! ఈశుడ వీవె
సాయి ! సర్వము నీవె శక్తి నీవె
సాయి ! యుగము వీవె సాయి ! కాలము నీవె
సాయి ! దేశము నీవె సర్వు నీవె
సాయి ! భాషలు నీవె సాయి ! భావము నీవె
సాయి ! భావాతీత ! సంగరహిత !
సాయి ! భక్తయు నీవె సాయి ! ముక్తియు నీవె
సర్వదూరుడ వీవె సత్యసాయి !

ఆ.వె. శిరిడి సాయి వీవె శిష్టరక్షక ! నాడు
సత్యసాయి విపుడు సకల సేవ్య !
ప్రేమ సాయి వౌదు ప్రీతితో మముగావ
సర్వదేవ రూప ! సత్యసాయి !

**సనాతన సారథి**

సెప్టెంబర్, 1975

## భక్తి ముక్తి దాత

**రచన : డా॥ ఎం.వి. సత్యనారాయణ**

సీ. బ్రాహ్మముహూర్తాన భవ్యసాయికి మ్రొక్కి
ఆసనంబుననుందు హాయిగాను
సచ్చిదానందుడౌ స్థాయిని ధ్యానించి
సత్యసాయినె గాంతు సత్వరముగ
భ్రూ మధ్య మందున పుట్టును తేజస్సు
తేజస్సులో నుండు దివ్యసాయి
నేత్రంబులను నేను నియతితో మూయగా
నేత్రముల్ కాంతితో నిండియుండు
ఆ కాంతిలో పరమాత్మ రూపుడు సాయి
అమృతం బొసంగు నాకంతలోనె ;
గురుడు సాయి, పరమ గురుడు నా సాయియే,
పరమేష్టి గురుడును భద్రసాయి
దర్శనంబిచ్చును దయతోడ నాకును
ముక్తినీయ దలచి పుణ్యసాయి ;
హృష్టుండనయి నాదు హృదయ కమలమందు
సర్వభూతస్థుడౌ సాయి దలతు
హరి గురు శివరూపడఖిల వేదమయుందు
ప్రణవ స్వరూపుడౌ పర్తిసాయి;
సకల యోగఫలదు సాయినే ధ్యానింతు
ధ్యాన గమ్యుడు సాయి తథ్యముగను
హంసమంత్రబునే ననిశంబు జపియింతు
సాంబశివుడు హంస సాయి యగుట;
దేహమెపుడు దివ్య దేవాలయంబని
జీవుడందు వెలుగు దేవుడంచు
సచ్చిత్వరూపుడు సాయి తెల్పును నాదు
షట్చక్రమములోన సంచరించి ;
ఆధార చక్రాన ఆ సాయి గణపతి
బ్రహ్మే స్వాధిష్టాన పద్మమందు;

మణిపూర చక్రాన మాధవుండా సాయి
మహిమలెన్నో చూపు మాయ బాపి;
నాయనాహత చక్రనాథ డౌ సాయిని
రుద్రుండందును వాని రూపమరసి;
నా విశుద్ధము నందు నాసాయి జీవుడు;
ఆజ్ఞయందు గురుడె ఆర్యసాయి;
బ్రహ్మరంధ్రము నందు పరమాత్మయే సాయి
సాయి హంస శివుడు శక్తియుతుడు
ఏబదియక్షరాలిమ్ముగా నున్నవి
ఆఱు పద్మములందు, అవియే వాఙ్మ
యంబులై విలసిలై, అజ్ఞాన హరములై;
సాయి వాఙ్మయ స్రష్ట సర్వవిదుడు
కుండలినీ యోగ కుశలుని ననుజేయు
సాధక హితుడైన సత్యసాయి;
'సోహమ' నెడి భావ చోదకుడే సాయి
ఆత్మశుద్ధియు గల యార్యులకును;
'తత్త్వమసి' యటంచు ధర్మరక్షకుడైన
సాయి తెల్పును శిష్టసాధకులకు;
'అహము బ్రహ్మము' నుచు నా సాయియే తెల్పు
సాధకోత్తములకు బోధచేసి
సర్వమహావాక్యసారంబులను దెల్పి
సత్ఫలితము లిచ్చు సాయి మనకు;
సాధకు డాత్మయె, సాయియే పరమాత్మ
ఆత్మయు పరమాత్మ ఆరయ నొకటె

ఆ.వె. సాయి భక్తుల కిల సకల యోగము లేల?
సాయి సూక్తి సుధయె సర్వమొసగ
భజనజపము చేయు భక్తుల రక్షించు
భక్తముక్తిదాత పర్తి సాయి

**సువర్ణ సుమమాల**

తేది : 23-11-1975

## విశ్వరూపుడు

రచన : డా॥ ఎం.వి. సత్యనారాయణ

సీ. సర్వదేవమయుని సత్యసాయిశుని
స్వర్ణోత్సవము జూడ సంతసమున,
పుట్టపర్తి కెటుల బోతినో యెరుగ, నా
తనువు మఱవ జేసె ధర్మసాయి
ఆ ప్రశాంత నిలయమంతటిలో జేర్చి నన్
సౌఖ్యంబుగా నప్డు సత్యసాయి
శిష్టభక్తుల తోడ క్షేమంబుగా నుండ
ప్రీతితో నెలవిచ్చె ప్రేమసాయి
స్నానంబు చేసి, నే జపతపంబులు సల్ప
చిత్రావతిని జేర్చె షిర్డిసాయి
జలములో, నే దిగ జలముపై, జలములో
జలము చుట్టును నుండె సత్యసాయి
వేనవేల్ రూపాల వెలసెనా సాయియే
విశ్వరూపుడు గాన వింత లేదు
నా తోడ సాయియు స్నానంబొనర్చెను
జలములో నేనిల్చి సాయి నామ
జపము చేయుచునుండ సాయి కానబడెను
తరులపై గిరులపై తథ్యముగను
కన్ను మూసిన సాయి కన్ను విప్పిన సాయి
బహురూపముల గానబడెను నాకు
సుందరకారుడై సూర్యబింబంబులో
సాయి తిరుగుచుండె శాంతమూర్తి
అర్ఘ్య పాదంబుల నందుకొనియె సాయి
ఆశీర్వదించె నన్నంతలోనె

ఆ.వె. ఆ నదీ జలమున నా బాలగోపాల
మెన్ని వేల మంది యెటుల స్నాన
మాడిరో యెఱుగును మాన్యసాయె, నాదు
మనసులోన నప్డు మసలుచుండె

## నవరత్నములు

రచన : డా॥ ఎం.వి. సత్యనారాయణ

శ్లో. 1. శ్రీ పుట్టపర్తీశ్వర ! సాయినాథ!
శ్రీ సత్యనారాయణ ! లోకనాథ !
పూజ్యేశ్వరాంబాసుత ! దేవదేవ !
త్వామర్చయామ్యాత్మని సాయిదేవ !

2. మత్స్యావతరాద్యఖిలాత్మరూప !
సద్భ సంపూజిత పాద పద్మ !
భూలోక వైకుంఠపతే ! రమేశ !
సాయీశ ! భక్తాన్ దివిజాన్ కరోషి

3. త్రేతాయాం రఘునాయకో భవద నౌశ్రీ సత్యసాయీశ్వర
ఏషో భూన్మురళీధరోభవహరో గోపీ ప్రియోద్వాపరే
ఏతద్ఘోరకలావసౌచభువనే శ్రీశక్తియుక్తశ్శివః
భక్తానుగ్రహశక్తి మానవతర ఛ్చీ పుట్టపర్తౌముదా

4. విభూతిదాతా నవిభూతిధారీ
త్రికాలవేదీ న త్రినేత్ర ధారీ
త్రితాపహారీ న త్రిశూలధారీ
భవాపహారీ శివసత్యసాయీ

5. భుక్తిప్రదాతా సన భక్తితుష్ట ః
భక్తిప్రదాతా సన భక్తితుష్ట ః
ముక్తిప్రదాతా సన ముక్తి తుష్టః
దీనార్త సేవాయుత కర్మ తుష్టః

6. కలిప్రభావత్కాలుషాంతరాత్మనాం
నరధామా నాం విషయోన్ముఖనామ్
మనుష్యదేహైః పశుకృత్యకారిణాం
స్వరూప విజ్ఞాన పరాఙ్ముఖానామ్
నిషిద్ధ బోగానుభవార్తి రోగినాం పరాపకారేషు రతాత్మనాంపై

స్వదీవ్యలీలామహిమాంశ్చదర్శయాన్
కరోతితాన్భక్త వరాంశ్చ సాయీ

7. సీ. విశ్వరూపా ! సాయి ! విశ్వేశ ! హృదయేశ !
పర్తీశ ! పరమేశ ! ప్రణవరూప !
ఈశ్వరాంబాసుత ! ఈప్సితార్థ ప్రద
సత్యనారాయణా ! శాంతరూప !
అభవుండవయినను ప్రభవించితివి నీవె
ఈ పుట్టపర్తిలో నేనెయులేక
ఈ ప్రశాంతి నిలయమెనలేని దిలలోన
నెలవు నీకిదిగాన నీలకంఠ !

ఆ.వె. సర్వదేవరూప ! సకల దేశీయులు
నిన్ను జూచిరెపుడొ నెమ్మనమున
ఈ ప్రపంచ సభకు నేగుదెంచిరిపుడు
భవహర ! నిను జూడ భక్తితోడ

8. ఐశ్వర్యమునకు నాత్మశాంతియె లేక
ఆరోగ్య రహితులై యార్తి బొంది
అధికారమున్నను నానందమే లేక
అవమాన భరితులై యార్తి బొంది
విద్య యెంతో యున్న విజ్ఞానమే లేక
అజ్ఞానమూఢులై యార్తి బొంది
దేవదాసులగుచు దేహరక్షణ లేక
ఆత్మనభిజ్ఞులై యార్తి బొంది

ఆ.వె. ప్రేమరూప ! నరులు ప్రీతితో నిను గొల్తు
తల్లిదండ్రి గురు డు దైవమనుచు;
అఖిలభక్తులకును నాత్మ నెఱుగ జేయ
నవతరించితి విట నార్తి బాప.

9. ఐహిక విద్యలు నాత్మవిద్యయు నేర్ప
బృందావనంబున ప్రేమరూప!
విద్యాలయమొకటి వెలసె నీ మహిమచే
కర్ణాటరాష్ట్రాన కలుషహరణ!
ఆ యనంత పురాన నఖిల మహిళలకు
విద్యాలయ మొకటి వెలయ జేసి
జయపురంబున గూడ సాయి ! నిర్మించితి
విద్యాలయ మొకటి వెల దులకును
ఈశ్వరాంబాస్మృతి కెనలేని విద్యాల
యంబిట వెలసె నీ యాశయమున
వైద్యశాలలు గూడ పలుచోట్ల నెలకొల్ప
నానతిచ్చుచునుంటి వమరవంద్య !

దశవిధావతార ధారి నీవే సాయి !
సత్యధర్మశాంతి సరణి మాకు
సాయి ! తెల్పు దువిట సర్వమతంబుల
సామరస్యమిపుడు సత్య మెఱుగ.

**ప్రశాంతి నిలయము**

22-11-1975

## విశ్వశాంతి దాత

**రచన : డా॥ ఎం.వి. సత్యనారాయణ**

సీ. పూర్వయుగము నందు ముక్తికై మునివరుల్
భువన సేవ్యమగునీ పుట్టపర్తి
నగరి జేరి యిచటి నగగుహలందున
తపమాచరించిరి తత్త్వమెఱిగి;
సాక్షాత్కరించిన సర్వేశ్వరుని జూచి
ముక్తికోర రయిరి పుణ్యమునులు;
సర్వేశ్వరుడు వారి స్వాంతం బెఱింగియు
నెఱు గనట్టుల నుండనేమి వింతొ!
సర్వవిదులు మనుల్ సర్వేశు నప్పుడు
కోరిరిటుల వారి కోర్కెదీర్ప;
"కలియుగంబున నరుల్ కలిమి బలిమియుండి
చిత్తశాంతియె లేక చెల గుచుంద్రు;
సత్యధర్మ ప్రేమ శాంత్యహింసాతత్త్వ
మెఱు గవారికి మంచి మేధలేక
సర్వమతంబుల సామర్య మెఱుంగ
సాధన సల్పెడి శక్తి లేక
అలమటింతురు వారలాత్మ నెఱు గలేక
దారి చూపు గురువు దరిని లేక;
అట్టివారిని గావనతరింపు మిచట
సర్వదేవాత్మక ! సత్యరూప !
నిన్ను నీ భక్తుల నిరతంబు సేవించు
మమ్ము ముక్తుల జేయు మపుడె స్వామి !
అనిన వారల కోర్కె నటుల దీర్ప దలంచి
సర్వేశ్వరుండిప్డు సత్యసాయి
అన, పుట్టపర్తిలో నవతరించెను మన
యీశ్రయిలతనయు డిత డె సాయి
బాల్యంబు నుండియే భవ్యలీలలు చూపి
భక్తకోటిని గాచె బాలసాయి;

పరమేశు మహిమలు పరదేశముల జూపు
పరదేశ పూజ్యు డు ప్రౌఢ సాయి ;
సత్యధర్మ ప్రేమ శాంత్య హింసాతత్త్వ
సారంబు దెల్పుచు సత్యసాయి
సర్వమతంబుల సామరస్యమె సత్య
సాయి మతంబని శాంతి కొఱకు
సర్వదేశంబుల సకల పురంబుల
స్థాపించుచుండె శ్రీ సాయి మతము
సత్యసాయీశుని స్వర్ణోత్సవము చూచి
సకల దేశీయులు శాంతి నొంద
పుట్టపర్తికి వచ్చి భువనైక వంద్యుని
సర్వదేవాత్మకు సాయి గొల్చి
సాయి వాగమృతంబు సంతసంబున గ్రోలి
పరవశులైరి యీ భక్తవరులు;
నా టి మునీంద్రులే నేటి పర్తీశు డౌ
సత్యసాయిశుని సంఘ సభ్యు
లిచట భక్తుల సేవ లెపుడు చేయుచు మది
సాయిని స్మరియింత్రు సంతతంబు

ఆ.వె. సాయి చూపుచుండె స్వర్ణోత్సవంబున
స్వీయ మహిమ లెన్నో క్షేమ మొసగ
భక్తిముక్తి దాత భగవాను డీ సాయి
విశ్వశాంతి దాత విష్ణువిత డె.

**ప్రశాంతి నిలయం**

23-11-1975

## అద్భుతమూర్తి

సీ. అద్భుతమూర్తియై యవతరించిన సత్య
సాయీశు ధ్యానింతు స్వాంతమందు
పుట్టపర్తిని సాయి గుట్టుగా వెలసిన
భక్తులతని గొల్తు ముక్తి కొఱకు
భక్తవత్సలుడును భగవానుడగు సాయి
సత్స్వరూపము దెల్ప సర్వులకును
బహిరంగముగ జూపు భవ్యసిద్ధుల నెల్ల
భక్తులు ముగ్ధులై బ్రహ్మమెఱుగ
శివరాత్రి సమయాన శిష్ట భక్తుల కడ
ఆత్మలింగము తీయు నార్య సాయి
సంకల్ప మాత్రాన సద్విభూతి సృజించి
స్వీయభక్తుల కిచ్చు శిష్టసాయి
ఆ విభూతి జనుల యఖిల వాంఛలు తీర్చి
ఆత్మ నెఱుంగ జేయు నఘము వాసి
స్వచ్ఛమై పరిమళ సంశోభితంబైన
సాయి విభూతికి సాటి కలదె?
సాయి భక్తులకిచ్చు జక్కనియుంగరాల్
వారి కీడును బాపి భద్రమొసగ
తన భక్తులెప్పుడు ధ్యానంబు చేసినన్
సాయి దర్శన మిచ్చు శాంతమూర్తి
సాయిని స్మరియింప సాక్షాత్కరించుమ
భక్తవరుదుడైన పర్తి సాయి
పూజింప, భక్తులు భుక్తి ముక్తులొసంగు
సాయిబాబా కిల సాటి యెవరు?
సత్యధర్మ ప్రేమ శాంతిరూపుడు సాయి
విశ్వశాంతిని గూర్చ వెలసె నిలను
'బాల వికాసు' ను బాల బాలికలకు
'మహిళా విభాగ'ంబు మహిళలకును

పుణ్య 'సాధన' రీతి పూరుష వరులకు
నెలకొల్పె సాయియే, నియతి తోడ
విద్యాలయంబులు వెలయించె సాయియు
ఉత్తమ విద్యల నొసగుటకును
ఆత్మ విద్యగఱప నఖిల భక్తులకును
గ్రంథముల్ రచియించు ఘనుడు సాయి
మన సనాతన ధర్మ మహిమలు బోధింప
అవతరించెను సాయి, అవనిలోన
సర్వమతంబుల సామరస్యము దెల్పు
సత్యసాయిశుడు సర్వులకును
అన్నాతురుల కెప్పుడన్నదానము సల్ప
సత్యసాయి వచించు సత్యసాయి
'ఓంకారనాదంబె ఒసగును ముక్తిని
భజన వలన గల్గు బ్రహ్మపదము
నగర సంకీర్తన తగ ముక్తి నొసగును'
అవి బాబ బోధించు నందఱకును

ఆ.వె. తల్లిదండ్రులందు దైవంబునందును
దివ్యగురువునందు దేశమందు
భక్తియుండవలెను ముక్తి పరులకైన
అనివచించు బాబ, అమృతవాక్కు.

విశాఖపట్నం

తేది 23-12-1976

## సత్యసాయి సకల శక్తియుతుడు

**రచన : డా॥ ఎం.వి. సత్యనారాయణ**

సీ.    బ్రహ్మశక్తియుతుడు బహురూపధారియు
            సత్యసాయి సకల శక్తియుతుడు
        శివశక్తిరూపు డు సేవ్య డు సాయియే
            పరమాత్మ రూపు డు భవ్యసాయి
        ఆత్మరూపదు సాయి ఆద్యంత రహితు డు
            ఆనంద రూపు డు హరిహరుండు
        పరమ హంసయె సాయి భద్రమూర్తియు సాయి
            దేవదేవు డు సాయి దీన సఖు డు
        అవతార పురుషుడు యజ్ఞరూపు డు సాయి
            యజ్ఞకర్తయు సాయి యజ్ఞభోక్త
        ఎల్లవస్తువులకు నీశు డు సాయియే
            భక్తుల బాధల బాపు సాయి
        సత్యరూపు డు సాయి సకల లోకనివాసి
            భక్తచిత్తనివాసి పాపహరు డు
        సంసారు లందురు సాయిని భజియింప
            జ్ఞానంబు ముక్తిని గాంచ గలరు

ఆ.వె.  సత్యసాయి మయము సకల జగత్తును
        సత్యసాయి ఘనుడు శాశ్వతుండు
        సత్యసాయి నామ సంస్మరణంబుచే
        భక్తకోటి ముక్తి బడయ గలదు.

విశాఖపట్నం

తేది 28-3-1978

## భక్త కల్ప భూజ ! భవ్య సాయి !

రచన : డా॥ ఎం.వి. సత్యనారాయణ

సీ. శ్రీ పుట్టపర్తీ శ శ్రీ సత్యసాయీశ !
ఈశ్వరాంబా సుత ! ఈశ ! శ్రీశ !
వేదంత గోచర ! వేంకటేశ్వర ! సాయి !
శ్రీ తిరుపతి వాస ! శ్రీనివాస !
పరమాత్మ ! దివ్యాత్మ ! ప్రాణ రక్షక ! దేవ !
భక్తహృదయ వాస ! పాపనాశ !
సత్యనారాణా ! శాన్తి శుభప్రద !
శ్రీకృష్ణ ! శ్రీరామ ! శ్రీప్రదాత !

ఆ.వె. అఖిలలోక వాస ! ఆర్తిహరా ! సాయి !
జ్ఞానముక్తి దాత ! కర్మ రహిత !
నిరుపమ గుణశీల ! నిర్గుణ ! నిఖిలేశ !
భక్త కల్పభూజ ! భవ్యసాయి !

విశాఖపట్నం

తేది 4-4-1978

## సర్వశక్తిమయుఁడ

రచన : డా॥ ఎం.వి. సత్యనారాయణ

సీ. వేద చతుష్టయ వేదాంగ వేదాంత
విదులైన శిష్యులు విప్రవరులు
ఆగమ ప్రోక్తమౌయర్చనా విధి తోడ
నఖిల దేవప్రతిమార్చకులును
యజ్ఞయాగాదుల నాచార నిష్టతో
పరమార్థ మతి సల్పు పండితులును
షట్ఛాస్త్ర గూఢార్థ సంప్రదాయజ్ఞులు
బ్రహ్మవిద్య నెఱు గు బ్రాహ్మణులును
సత్యసాయీ! నీకు సాష్టాంగ దండ ప్ర
ణామంబు సల్పిరి సమ్రులగుచు;
బహుజన్మ సంప్రాప్త పరమ సంస్కారులై
పరమార్థరతులైన పండితులును
నీ పాద కమలముల్ నియతితో సేవింప
వారి కోరిక యేమి? భవ్యసాయి!
ఆత్మవిద్యాతత్త్వ మరయు వారైనను
ఆత్మ నెఱుంగరా? ఆదిదేవ!

ఆ.వె. నీ తనువును జూచి నిన్నెఱుంగ దరంబె?
భక్తముక్తి దాత ! బ్రహ్మరూప !
ఆత్మ నెఱు గ జేయు నా పరమ గురు డ !
సర్వశక్తిమయు డ ! సత్యసాయి !

ప్రశాంతి నిలయము

21-11-1978

## భక్త కల్పశాకి – పర్తి సాయి

**రచన : డా॥ ఎం.వి. సత్యనారాయణ**

సీ. పుణ్యభూమి భువిని పుట్టపర్తియె గాదె
ఈశ్వరాంబాసుతు డిచట నుండ
సత్యనారాయణ సత్యసాయిశు డు
శివశక్తిరూపుడు శిష్టులార!
వాణి లక్ష్మియు దుర్గ పావన సాయియే
సకల సుఖము లిచ్చు సంతతంబు
భక్తితో సాయీశు భజనలు చేసిన
భవబంధముల బాపు భవ్యసాయి
సర్వలోక నివాసి సత్యసాయీశుడు
భక్తచిత్త నివాసి పర్తిసాయి
కర్తకారయితయు కర్మయు సాక్షియు
సర్వజగత్కర్త సత్యసాయి
జ్ఞానము జ్ఞేయము జ్ఞాతయు సాయియే
సర్వజ్ఞు డీతడు సత్యసాయి
ధ్యానము ధ్యేయము ధ్యాతయు సాయి యే
ధ్యానగమ్యుడు సాయి తథ్యముగను
వేదవేద్యుడు సాయి విశ్వరూను డు సాయి
విశ్వనాథుడు సాయి విజ్ఞులార!
ఆత్మార్పణము సేయ నాత్మరూపుడు సాయి
ఆత్మ భక్తవరుల నాదుకొనును

ఆ.వె. మనుజ సేవచేసి మాధవు గాంచగా
మార్గదర్శకుండు మహిని సాయి
ఇహపర సుఖశాంతులీ సాయియే యిచ్చు
భక్తకల్పశాఖి పర్తిసాయి

విశాఖపట్నం

## అవతారపురుషుడు

**రచన : డా॥ ఎం.వి. సత్యనారాయణ**

సీ. వేదవేదాంతముల్ వేమారు చదివిన
దేవుని జూడవదేమో కాని
దేవాలయంబుల దిరముగా గూర్చుండి
దేవునీక్షింప వదేమో కాని
పుణ్యతీర్థములకు బోయి క్రుంకు తిడిన
దేవుని గాంచమదేమో కాని
దాన ధర్మంబులు తనివితీర గ జేయ
దేవు నరయ వేమదేమొ కాని
కులధర్మముల నెల్లగుఱుతుగా నొనరించి
దేవలీల గనమదేమొ కాని
వివిధ మతంబులు వేసార జర్చించి
దేవు నెఱుగ లేవదేమొ కాని

ఆ.వె. చింత వలదు మనకు శీఘ్రమే యేగిన
పుట్టపర్తి యనెడి పుణ్యభూమి
యందు గాంతు మిపుడె యవతార పురుషుని
సర్వదేవమయుని సాయి దేవు

సీ. 2. ఈశ్వశాంసయుతుడు నీశ్వరాంబసుతు డు
సత్యసాయి సకల జననుతుండు
పుట్టపర్తి నతడు పుట్టి నప్పటి నుండి
మహిమలు చూపెను మహిత సాయి
కలి దోషహతులయి కల త చెందు నరుల
నాదుకొనగ సాయి యవతరించె
మనుజులలో నున్న మాధవు గాంచగా
మత రహస్యము దెల్పుమాన్య సాయి

ఆ.వె. సర్వమతముల గల సామరస్యము దెల్పు
సత్యసాయి మత మె సత్యమనుచు
సకల దేశజనులు సత్యసాయిని గొల్తు
భక్తిముక్తి కోరి భద్రమతులు